సకలానందగ్రంథమాలిక
16 వ పుష్పము

సంపాదకుడు :
సత్యవోలు రాధామాధవరావు.

# మహేంద్ర విజయము.

శ్రీ రాజా రావు వేంకటజగ్గారాయణంగారి
సంస్థాన పండితులగు
సత్యవోలు సోమసుందర కవిగారిచే
రచియింపబడినది.

మొదటి కూర్పు.

కాకినాడ
శ్రీ లక్ష్మీ ముద్రాక్షరశాలలో
ముద్రితము.

1940



వెల 1—0—0.

# కవివరు నన్వయ నామాదులు



సీ. ఘన సాహసౌదార్య గాంభీర్య నిధిసోమ
రాణ్మంత్రి, యేకవి రాజు తాత
నయగుణ విద్యావి నయశాలి వెంకట
రాయు, డే సత్కవి రాజు తండ్రి
సద్గుణ సంతాన సంతాన వల్లి యా
రామాంబ, యేకవి రాజు తల్లి
రావు వెంకటజగ్గ రాయాహ్వయ మహీత
లేంద్రు, డే కవిరాజు నేలు రాజు

గీ. అట్టి శ్రీ సత్యవోలు వంశాబ్ధి చంద్రు
సతత సంగీత సాహిత్య సత్కవిత్వ
సరస మతిసాంద్రు సోమ సుందర కవీంద్రు
నను నయకదంబ జగదంబ మనుచు గాత.



# విజ్ఞాపనము.



1. శ్రీ శాంకరీకటాక్షముచే మా తండ్రిగారగు సోమసుందర కవిగారు మొదటినుండియు సంగీత సాహిత్య కవితాచాతురీ ధురీణులై రాజపోషణము గలిగి సంస్థాన పండితులయి 33 గ్రంథములు రచియించిరి.

2. మా తండ్రిగారికి మేము ఆరుగురు కుమారులలో నేనైదవవాడనైనను వారు నాకు సంగీతసాహిత్యకళలను మిగుల మఱింతవాత్సల్యముతో ప్రబోధించుటచే వారియందు మఱింత గురు పితృభావము హెచ్చి నా సంసారపోషణాతోపాటు వారి యముద్రిత గ్రంథ ముద్రణా భారముకూడ నాపైబడినది.

3. నేనెట్లైనను గురుపితృఋణంబు దీర్చుకొనుటకై వారి గ్రంథ ముద్రణము ప్రధానమనితోచి ముద్రించునంతటిలో మఱింత ఋణగ్రస్తుడనై పోవుచున్నాడను.

4. ప్రస్తుతము మా తండ్రిగారు ఆ 1888 సం॥ రమున రచించిన మహేంద్రవిజయమును మా గ్రంథమాలికా సహాయులకై నేటికి యాబదేండ్లకు ముద్రించి కృతకృత్యుడనైతిని.

5. లోకములో సకల మానవులును క్షేమ స్థైర్యధైర్య విజయాయురారోగ్యైశ్వర్య సంపద్యశోవిభవశుభమంగళాదులైన సర్వసుఖంబుల ననుభవించుటకు భగవద్భక్తియే ముఖ్యకారణమని యనేక పురాణాది గ్రంథములు చదివియు పెద్దలవలన వినియు తమ సంపూర్ణమైన స్వానుభవమును గ్రహించియూ నీ గ్రంథము రచియించినట్లు పాఠకులే

6. ఇందు ఆంధ్రకవిత్వమున కలంకార రూపములైన భక్తిరస పూరితములగు మత్తకోకిల, ధ్రువకోకిల అశ్వధాటీ మున్నగు ననేకవృత్త జాతులు గలిగియుండుటచే ఇది ప్రతి మానవుడును చదివి యానందించ వలసిన గ్రంధరాజమై యున్నది.

7. సర్వమనోరధ సిద్ధికై భక్తి ముఖ్యమగుటచే ప్రస్తుతపాఠ శాలలలో విద్యార్థులకు గూడభక్తి ప్రపత్తులనుగూర్చి బోధించుట ముఖ్యావసరము.

8. కావున పండితపామర సదుపయోగమగు నీ గ్రంధము పాఠశాలలోగూడ పఠనీయముగా నేర్పడిన మిగుల నోపికతో రచియించిన మా తండ్రిగారి పరిశ్రమయు నంతకన్నను మహాకష్టపడి ముద్రించిన నామనోరథంబును సాఫల్యముకాగలవు.

9. భగవంతుడు మాపాలిటనుండి టెక్స్టుబుక్కు కమిటీవారికిని ఆంధ్రయూనివర్సిటీ వారికిని సదభిప్రాయము గలిగించుగాక.

ఇట్లు విధేయుడు.
సత్యవోలు రాధామాధవరావు,
సంగీత సాహిత్య విద్వాన్.

మకాం కాకినాడ,
5—8—40



అభినవ పోతరాజ

సత్యవోలు సోమసుందరకవిగారు.



# పీఠిక.

ఈ నాటకము సుప్రసిద్ధ కవీశ్వరులగు కీ. శే. సత్యవోలు సోమసుందరకవిగారిచే రచియింపబడినది. ప్రఖ్యాతేతి వృత్తమగు వామనావతారకథను గైకొని ప్రదర్శనానుకూలముగ నుండుటకై కాలదిమార్పులతో సులభమగు శైలి నీ యాఱంకముల నాటకమును వారు రచించియున్నారు. బలిబంధనముతో మహేంద్రునకు విజయము ప్రాప్తించుటచే నీ నాటకమునకు మహేంద్రవిజయమను యన్వర్థాభిధానమీయబడినది. ముఖ్యమగు స్థలముల గ్రంథకర్తలు భాగవతమునందు పద్యములనే తీసుకొని రసపోషణ మొనర్చిరి. వివిధములగు వృత్తములు, నేటి ప్రేక్షకలోకమున కాకర్షణమగు పాటలు నందందు పొందుపరుపబడినవి.

శ్రీ సోమసుందర కవిగారు శ్రీ రాజా రావు వేంకట జగ్గారాయణంగారి యాస్థానపండితులై 1926 సంవత్సరమున గీర్తిశేషులైరి, వీరు రచించిన వచనాంధ్రకాదంబరి, ఆంధ్రపండితరాయ శతకము, ఆంధ్రచంపూభాగవతము మొదలగు కొన్ని గ్రంథము లిదివఱలో ముద్రింపఁబడినవి. వీరి పుత్రులు శ్రీ రాధామాధవరావుగారు తమ తండ్రిగారి యందలి భక్తిచే వారి యముద్రిత గ్రంథములను బ్రకటింపుచున్నారు. ఇంకను బెక్కు గ్రంథములు ముద్రణభాగ్యము నందవలసి యున్నవి. శ్రీ రాధామాధవరావుగారి ప్రయత్నమున కాంధ్రభాషాభిమానులు తగిన చేయూత నొసంగి మిగిలిన గ్రంథముల బ్రకటింపఁజేసి యాదరింతురుగాక!

ఇట్లు

కాకినాడ, 29-7-40.

కిడాంబి రాఘవాచార్యులు,
ఆంధ్రసాహిత్య పరిషత్కార్యదర్శి.

# ఇందు వచ్చు పాత్రలు.



## పురుషులు

ఇంద్రుడు

బృహస్పతి

బలిచక్రవర్తి

శుక్రాచార్యులు

కశ్యపుడు

నారదుడు

వామనుడు

గంధర్వులు

## స్త్రీలు.

అదితి

శచీదేవి

కావేరి

కస్తూరి

వింధ్యావళి

—:o:—

# మహేంద్ర విజయము.

## నాటక కథా సంగ్రహము.



### ప్రథమాంకము.

మహేంద్రుడు లోకపాలకులగు నగ్ని, యమ, వరుణ, కుబేరాదులతో గొలువుకూటంబున గూర్చుండి. బలిదానవాదులు తమపైకి దండెత్తివచ్చుచుండుట విని దానికి ప్రతిక్రియ నాలోచించుచుండగా నొక చారుడువచ్చి బలి దైత్య నాథుడు సేనలతోవచ్చి నందనారామమున దండువిడిసెనని తెల్ప దిక్పాలకులును వైరులతోఁ బోరొనర్చుటకు దమతమ ప్రభావంబులం దెల్పుకొనుచుండ గురుండగు గురుండువచ్చి బలిచక్రవర్తి యిపుడు శుక్రాచార్యు ననుగ్రహమున విశ్వజిద్యాగమొనరించి బలసియుండె గావున నిపుడు వాని నెదిరింప శక్యముగాదు గావున మన మెల్ల వీనికిపుడు గానంబడక దాగియుండుటయే మేలని యు మరల భార్గవశాపంబున బలి, యింద్రపదభ్రష్టుండగునపుడు మనకు మరల లాభముగల్గునని యు నంతవరకు మనము గానరాకుండవలెనని యు, నింద్రాదులతో దెల్ప వారెల్లరును సమ్మతించి మారువేషంబులతో సంచరించుటకు బోవుదురు.

### ద్వితీయాంకము.

బలిచక్రవర్తి దేవాంతక నరాంతక ప్రముఖులగు నమాత్యవరులతో సుధర్మ సభ నధిష్టించి తన విజయంబునకును - మహేంద్రాదుల పలాయనంబునకును సంతసించుచుండ, నారు బలిచక్రవర్తికి నాధిక్యతయు నింద్రునకు దోషారోపణంబులం జేయుచుండుటచే నాత్మస్తుతి

నున్నవాయని యడుగుచు దేవతావేశ్యల నాట్యాదుల్లంగాంచి సంతోషించి శుక్రాచార్యుండరుదెంచి దేవబ్రాహ్మణభక్తిచే నీకిట్టివైభవం బలరెనని హెచ్చరింప విని బలి సంతసంబున శతాశ్వమేధయాగంబులను నాచేఁ జేయించి శతక్రతుండ నను సార్థకనామునిజేయుమని శుక్రాచార్యుని వేడ నాతండును నిది మసాధ్యంబని తలంచియు నట్లనేయని తన వృద్ధాప్య మును దెల్పి క్రతుప్రారంభమునకు ముహూర్తంబు నుంచెదనని తెల్పి తత్కాలకృత్యంబునకై వెడలెను. పిమ్మట నంధరును కాలోచితకృత్యంబు లకై బోవుదురు.

## తృతీయాంకము.

అదితి తన బిడ్డలగు నింద్రాదులను సవతిబిడ్డలగు దానవులు వెడలగొట్టి యమరావతి నాక్రమించి రాజ్యపదభ్రష్టులను జేసినందుకు చింతిల్లుచుండ కస్యపుడు గాంచి యామె నూరడించుచు జగంబెల్ల భగ వదధీనంబైనది. గావున నాపదలందు ధైర్యమవలంబింపవలెను గాని దుః ఖింపవలదని చెప్పి సురల రాజ్యపదప్రాప్తికై యట్టి భగవద్ధ్యానంబున మేలుగల్గునని యదితికి జపం బుపదేశించెను. అట్టి వ్రతవిధానంబున శ్రీహరి సాక్షాత్కారంబు గల్గ నదితి భక్తితో దన తనయులకుం గల్గు నిడుమలం బాపుమని వేడ నట్లేయని యట్టిరాజ్యంబు గొనివచ్చుటకై నీకు పట్టినై పుట్టెదనని వరమొసంగ వెడలునంత నదితియు సంగతినంత యు కస్యపున కెరిగించి వారిర్వురును నట్టి భగవదుదయంబును గోరుచు తత్కాలకృత్యంబులకై యేగుతఱిని ! కస్తూరి కావేరియను నదితి పరిచా రికలువచ్చి యదితి శ్రీమన్నారాయణు ననుగ్రహంబున గర్భంబు దాల్చుసంగతి పరస్పరంబు దెల్పుకొందురు. పరమేశ్వరు డామె గర్భస్థు డగుట నెరింగి చతుర్ముఖాది నిర్జరులువచ్చి గర్భస్థుడగు శ్రీమన్నారాయ ణునింబొగడి భక్తితో నమ్నుతించి వారలేగ కస్యపుంగాంచుటకై బృహ స్పతి యరుదెంచునంతట సురదుందుభులుమ్రోగి విరులు వానగురియు చుండుసమయంబున హరి వామనుడై యవతరించినసంగతి యంతఃపురం

బుసతులడి విని కస్యపుడు పుత్రోత్సవాదులం బాచిపెట్టుటకై జాతకర్మ నామకరణాదు లొనర్ప లోనికింబో బృహస్పతి లోనికిం బోవుచుండు.

చతుర్థాంకము.

నారదతుంబురులువచ్చి వామనునకు నామకరణాదులేగాక నుప నయన కలాపంబుగూడ నైనసంగతివిని వారలనెల్లగాంచ లోనికింబోవ కస్యపుడచట వామనుంగని ముద్దిడుకొనుచుండుతఱిని నారద తుంబురు లా వామనుంగాంచి భక్తితో మిగుల సన్నుతించి రహస్యముగా తమ శిష్యులగు ప్రబుద్ధమేధావులతో బలిచక్రవర్తి తొంభైతొమ్మిది యజ్ఞ ములు చేసెను. నూరవ యజ్ఞము చేయనుండెను. నది పూర్తిగాక మున్నే తద్విఘ్నంబునకై వామనుం దోడ్కొని యటకేగుడని యుపదే శింప నట్లేయని వామనుం బ్రోత్సహింప యదితి కస్యపులదఱిని శెలవు గైకొని వామనుండు వారలతో బలిమఖ వాటికం జేరెను. పిదప నచట బలి తనసతియగు వింధ్యావళితో పురోహితాదులగు చండామా ర్కులును, శుక్రాచార్యుండును దెల్పునట్లు యజ్ఞంబునకై హోమంబు లొనర్చుచుండ వామనుండు వారలగాంచి యచటి ఋత్విక్కులగు పం డితులనెల్ల తనతో నేశాస్త్రమందు వాదించి గెల్చుకొందురని తన పాం డిత్యమహిమ జూపుచు బలింగాంచి ముఖంబునకు మెచ్చియుండ. యాత డును సాక్షాత్కరించిన యజ్ఞభోక్తయగు భగవంతుడగు నావామనుని రాకకు తన జన్మయు జన్మంబును సఫలంబుగాదలంచి. యాబలి నీకోరిన కోర్కెలిచ్చెద గోరుకొమ్మన. నాతడును మాయావటుండగు శ్రీహరి యగుటచే తనకు జపతపంబు లొనర్చుకొనుటకు జాలిన మూడడుగుల నేల మాత్రమే. కోరనప్పుడాబలియు నట్లనే యొసంగుదునని వాగ్దాన మొసంగ బలిగురుండగు శుక్రాచార్యుండు మాయావటుండగు శ్రీహరి యాదానంబువలన నీ సర్వ భూమండలంబు నాక్రమించి! హరించుగాన పలదనియు ప్రమాదము గల్గునపు డసత్యము పలుకవచ్చునియు మున్నుగు హితంబులు దెల్ప. బలిదాను మాట దాటజాలని వదాన్య

డాటచే వాడితప్పనని వింధ్యావళీ సహితుండై వామను పదంబులు గడిగి యిపుడే పుడమి నిడుదునని దానధార నొసంగునంత నది గ్రహించుచు ధారవడు ఝారీగంధ్రంబున మాయరూపంబున దూరి ధార పడకుండ జేయు శుక్రుంగని పుడకతో బొడిచి వామనుండు వానికొక కన్ను గ్రుడ్డిచేసె. పిదప బలి మఖపూర్తికై వామనాదులతో నెల్లరులోనికి బోవుదురు.

## పంచమాంకము.

ఇర్వురు గంధర్వు లాకాశమార్గంబున వచ్చి; వామనుండు బలి యెదుట తన మూడడుగులకును తన త్రివిక్రమ రూపంబున మూడు భూమ్యాకాశంబులు రెండు పదంబుల నాక్రమించి యుండునట్టి విశ్వ రూపంబువర్ణించి చూచినదెల్ల జెప్పుచు నొక పదంబు బ్రహ్మలోకంబు జేర నది బ్రహ్మ గడుగ నది సురనదియగుటయు బలి వామనునిచే పాశ బద్ధుడై యుండుటయు ముచ్చటించుకొని, పోవుదురు. వామనుడు వచ్చి వారుణ పాశబద్ధుడగు బలితో నరుదెంచి నీవొసగు మూడడుగుల దానమునకును భూమ్యాకాశము లాక్రమించినను రెండడుగులకుజాలదయ్యె. మూడవయడుగునకు తావు జూపుమని యడుగ తత్పదము తన నెత్తిపై నుంచుమని బలి నుడువుతఱి. కొందఱు బలి పరిచరులగు రాక్షసులు వామనుం దునుమాడుటకు ననుజ్ఞ గోర, కూడదని బలి దెల్పె. నంత నారదుండరుదెంచి నీమఖమునకు సంతసించి యజ్ఞేశ్వరుడగు శ్రీహరియే యిట్లరుదెంచి నిన్ను ముక్తుఁ జేయుటకే యిట్లుపాశబద్ధుం జేసె. శీఘ్రంబుగా నిముక్తుంజేయునని దెల్పి వామనుంగాంచి సన్నుతించి చనునంత బలిచక్రవర్తి తాతయగు ప్రహ్లాదుఁడరుదెంచి బలితో సర్వచరాచర పరిపాలకు శ్రీభగవంతుని స్మరించి సర్వ భవబాధములు వీడు నీవారుణపాశ బంధమన నెంతయని భగవద్భక్తి నుపదేశించి వామనుతో సర్వభూదానమిడిన నిర్దోషు నీబలిని రక్షింపుమని ప్రార్థింప నతడు నిముషమాత్రంబున నక్లేశు సేతునని వింధ్యావళీ చతురాననుల ప్రార్థనల చొప్పునను

బలి పాశబంధంబులు దొలఁగించెను. దన దయమీర సుతలలోకంబున నివసింప నియమించె. బలియు సంతసించి శుక్రాదులతో మఖ పూర్తిగా వించిసుతలంబునకు బోవనేగుదురు. వామనాదులును బ్రహ్మాదులతో కస్యపప్రముఖులం గాంచ నేగుదురు.

## షష్ఠాంకము.

శచీపురందరాది సహితులై యదితికస్యపులు వామనుని రాక గోరుచుండునంత, బ్రహ్మాది భూసురులతో వామనుండరుదెంచి తలిదండ్రులకు మ్రొక్కి, బలినిగోరి సురేంద్ర వైభవంబెల్ల గొనితెచ్చి వచ్చితి నని తెల్ప తలిదండ్రులు ముద్దిడుకొన నావామనుండు శచీపురందరుల కిర్వురకు స్వారాజ్య పట్టాభిషేకంబు గట్టనెంచి పూలమాలికలను మెడనువైచి పట్టంబు గట్టెను. దేవదుందుభులు మ్రోగును. ఇంద్రుడు సోదరునిట్టి ప్రతిభకు మెచ్చుకొనునంత. నీశ్వరాది దిక్పాలకులు నెల్లరు వామనుని నతనిగన్న నదితిగస్యపులను కీర్తింప. సర్వమంగళ కటాక్షమున నన్నియు ననుకూలమగుచుండునని వామనుండు దెల్పుతఱిని శంకరాదులెల్ల సర్వజగదాధార భూతుండీతడేయనియు అప్పటినుండీతడు నుపేంద్రుడుగా నెంచదగినవాడనియు తీర్మానించుకొనినుతించిరి. వామనుండును సర్వవాంఛితార్థ ప్రాప్తిగల మీకేమికావలెనని భరతవాక్యానుసార మాశీర్వదింప సంతసించి యెల్లరును పరస్పరంబును శెలవుగైకొని సంపూర్ణానందముతో తమతమ స్థానంబుల కేగుదురు.



శుభమస్తు.  శ్రీరస్తు.  అవిఘ్నమస్తు.

# మహేంద్ర విజయము.



నాంది—"ప్రస్తావనము."

ఉ. శ్రీరమణీ! మదీయ కరసీమను నిల్వక తావకాధరో
దారమణీఘృణిన్ గని ముదంబున బింబమటంచు జేరుమ
త్కీరమనంగ నవ్వెడు సతింగని మెచ్చుచు ముచ్చటించు నా
శ్రీరమణీ మనోహరుడశేషసుఖంబు లొసంగి బ్రోవుతన్.

"క్రౌంచపదవృత్తము."

శ్రీరమణీశా జితభవపాశా శ్రితజనముఖసరసిరుహదినేశా
వారణపాలా పరమసుశీలా వరగుణమణిగణ భరణసలీలా
సారసనేత్రా సరసచరిత్రా సజలజలదచయ సమరుచిగాత్రా!
నీరజనాభా నిరుపమశోభా నిరతసుకవిజన నిచయకృతాభా!

గీ. బలిని వంచించికొనివచ్చి భాసురముగ
నెలమినీరగ మరల మహేంద్రవిభవ
మింద్రునికొసంగినట్టి యుపేంద్రమూర్తి
మేలులొసగూర్చి సభ్యుల నేలుగాత!

"నాంది యయిన పిమ్మట—తెరవంక జూచి"

సూత్రధారుడు—మారిష! నీవిటురమ్ము!

నటుడు—ఇదిగో వచ్చెద నేమి శెలవిచ్చెదవు బావా! మహానుభావా!

సూత్ర—మనమిపుడు వేడుకగా సెద్దానినాడి యిచ్చట సకలజన మనో
రంజనంబు గావించుదము.

నటుడు—ఎద్దియైన నొక యుత్తమనాయక చరిత్రం బగు నవీన నాట
కంబు నాడీరవలయును.

సూత్ర—అట్లైన సత్యవోలు సోమసుందర కవీంద్ర విరచితం బగు మహేంద్రవిజయ నాటకంబు నాడి యీ సభాసదుల యుల్లం బులు బల్లవింపజేయదలచితి, నందుకేమిజెప్పెదవు.

నటుడు—సరే, మంచిదే యగునుగాని యిప్పటిప్పటి నవనాగరికులు రచించిన యెన్నెన్నియో గొప్పగొప్ప నాటకంబు లున్నవిగదా. యిపుడీ నాటకమునాడి వీరిని మెప్పించి మనము మెప్పొంద గలమా!

సూత్ర—నీ వందుకు సందియ మొందవలదు. సువర్ణత్వంబుగల యీ నాటకము హాటకమువలె వెలయుచున్నది. గావున పావనాత్మకు లగు వారి నయనపుటంబులం బడి వన్నెకెక్కక మానదు.

గీ. శుచిముఖముజెందుటను బహు శోభగాంచు
హాటకములీల సరసమౌ నాటకంబు
సతత పరిశుద్ధులగువారి సమ్ముఖంబు
నొంది కడువన్నె వాసిని జెందకున్నె.

నటుడు—అవునవును. చక్కగా వక్కాణించితివిగాని—సమగ్ర రసగ్రహణ పరిపూర్ణులగు నీ ఘనులకు క్షారనీరప్రధానమువలె మన గానరస మంతగా రుచించునా యని సంశయించుచున్నాను.

సూత్ర—ఆలాగునా—అదే యుదాహరించి చెప్పెద వినుము.

గీ. క్షారనీరములనే గ్రోలి ఘనులు మిగుల
మధురజలముల నొసరించు మాట్కి వీరు
ఘనతమీరగ నట్టిదా గానరసము
గ్రోలుటయెకాదు పైపెచ్చు గుణమొనర్త్రు.

నటుడు—భళీ నా మాట బాగుగా నలంకరించితివి. యీ పాటి మన మీనాటకమున పాత్రాంతరంబుల బ్రవేశింపజేయుట కేగివత్తము రమ్ము!

సూత్ర—అట్లైనచో నిప్పటి కాలానుగుణంబుగా కొంచెము గానంబు గావింపుము.

నటుడు—మంచిదటులనే సేయుదును. (అని కొంచె మాలోచించి)

చ. పలుమరు దోరబాడులను బాదువుగా గొని మెక్కి చక్కగా
జిలిబిలి ముద్దుపల్కులను జిల్కలువల్కుచు నుండ మెండుగా
వలగొని పూవుదేనియలు పానముసేయుచు గానరక్తిమై
నళులటు బాడుచుండ జివురాకుల నామెత జేయునామనిన్
గులుకుచునుండు గోయిలలు కోయనికూయదొడంగె హాయిగాన్.

సూత్ర—ఆహా—మారిషా! నీవు గావించు గానరస. మెంత రంగుగా
నున్నది—యిపుడీ రంగస్థలంబునం దంతటను వసంతంబును జిల్క
రించిన ట్లొనర్చితివి—భళీ! దీనివలన కంతుని చెలియగు వసం
తునిరాకచే నాజయంతుజనకుని నందనోద్యాన మెంతయో
చక్కగా నలరుచున్నదని సూచించుచున్నది.

నటుడు—ఆహా! మహేంద్రుని పూదోటయే. తానంత సీటుగా నలరు
చున్నచో నా మహనీయుని సుధర్మాభ్యంతర మెంత వింతగా
వెలయుచుండునోగదా!

సూత్ర—ఆ యింద్రసభను జూడ నీకేకాదీ సభవారికి గూడ వేడుక
గలిగే యున్నది. కావున తదధిష్ఠాన దేవతలగు నింద్రాది వేషం
బులు సిద్ధంబుగా నుండున ట్లాజ్ఞాపింపుము.

నటుడు—అటులనే సేయుదును. (అని యిరువురును వెళ్లుచున్నారు.

(ఇది ప్రస్తావన.)



# మహేంద్ర విజయము.



## ప్రథమాంకము.

"లోకపాలకులతో నింద్రుండు కొలువులో ప్రవేశించుచున్నాడు."
"అందఱును సముచితాసనంబుల గూర్చున్న పిమ్మట"

ఇంద్రుడు—వీతిహోత్ర, యమ, వరుణ కుబేరాది దిక్పాలకులారా!
వింటిరా! యొంతవింత!

చ. మును మనతో నెదిర్చి జయముం గొనజాలక పోయి బన్నముల్
గొను నసురాధముల్ మరల గూరిమి మీరగ బోరొనర్పగా
మన సురధానిపై కిపుడు మానకవచ్చెదరన్న ముచ్చటల్
వినబడుచుండె నెంతయును వింతగ నియ్యెడ వీతిహోత్రుడా!

ఇట్టి బెట్టిదంబగువార్తలు మన చారులవలన వినవచ్చుచున్నవి.
ఆహా! యేమిచిత్రము!

వీతిహోత్రుడు—అవునౌను మహేంద్రా! బలి మరల దానవబలంబుదో
డ్కొని వచ్చుచున్నాడనియే మేమును వినుచున్నారము. కాని
యీమాట నిజమని తోచదు.

గీ. మున్ను మనలకు నోడి తా మెన్నొ బన్న
ములను గైకొన్న దనుజులు మోహరించి
మరల యెటువచ్చెదరొ! సిగ్గుమాలి యిటకు
వాసవా! భయరసవాస! వారలిపుడు!

యముడు—పాకశాసనా! లోకపాలురమగు మనచేత మున్ను గెలువం
బడి పారిపోవలేదా! సిగ్గుమాలి మఱల నిపుడెట్లు వచ్చును!

క. ఆలమొనరించు తఱి ది
క్పాలురమగు మనకు నోడి బలి బలుమతన్
దూలి చనలేదె లజ్జను
మాలి యెటుల్ వచ్చు నిపుడు మరల బిడౌజా!

వరుణుడు—వాసవా! యేమి! బూడెదలోబడి పొర్లుచుండెడు గాడెదలను గలసి యుముక దినుచుండు బలికిపుడింత బల వైభవంబు లెట్లు గల్గినవో తెలియకున్నది. ఆహా!

క. బూడెదలోబడి పొర్లుచు
గాడెదలన్ గలమెలసి కడువడి నుముకన్
గూడుగ గుడిచిన బలియెటు
వేడుకతో మరలననికి వెడలెడు నింద్రా!

కుబేరుడు—గీ. కూరిమిని భార్గవాదుల జేరి కోరి
వారికరుణా కటాక్షంబు వలన మఱల
భవ్య తేజో బలవిశేష వైభవముల
బలి ప్రబలియుండెనని వింటి బలవిరోధి!

బిడౌజా! విశ్వజిద్యాగ మహిమచే నట్లు వెలుగుచున్న వానిని విని యుంటిని.

ఇంద్రుడు—వైశ్వానరాది ప్రముఖులారా! కానిండు. రానిండు! తొల్లింటి కైవడి వాని నీమారు పోవనిత్తునా!

గీ. కాని రానిండు తొల్లింటి కైవడిగను
వానికీమారు పారిపో వంగ వశమె
పాకబల దానవాదుల పగిది నేడు
బలియు నాబారిబడి హాని బడయుకున్నె!

ఈశానుడు—వజ్రహస్తా!

క. బలిమరలను జలమున దన
బలములతోగూడి యాహవంబొనరింపన్
వలచి యమరావతికి రా
దలచినవాడనియె వింటి దఱచు సురేశా!

మహేంద్రా! మన బారిబడి యీమారు దానెచటికి బారి పోవును—

కానీ, కలిమిలేములు రెండు నెవ్వారికిని దిరిగి వచ్చుచుండు గావున మనమందుకు సందియంబు నొందవలదు.

"అంతలో నొక చారుడు ప్రవేశించి. భయ సంభ్రమంబులతో గొప్ప కేకలు వేయుచు"

చారుడు—ఆహా ! యిక నేమిజెప్పుదు నేమిజెప్పుదును. మహేంద్రాది లోకపాలకులారా ? మహావీరులారా ? బలిదానవేంద్రుడు క్రోధరస సాంద్రుడై నాకలోకంబు నాక్రమించుటకు దానవా నీకంబులఁ జేకొని మన రాజధానిం జుట్టుముట్టి నందనారామం బునందుండు విడిసినాడు. యిందుకై తొందరగా మీరలందరును కర్తవ్యంబు నాలోచింపుడాలోచింపుడు.

ఇంద్రుడు—(భయ సంభ్రమంబులతో!) అవురా చారా! నయవిచారా! యేమిదీసమాచారము ఆలాగునేమి. యెంత వింతగా నున్నది. కానిమ్ము. రానిమ్ము! యోచింతము. నీవేగుము.

"అంత తెరలో బలిచక్రవర్తి వేయించు శంఖ భేరీనినాదంబులు మ్రోగును."

ఇంద్రుడు—(విని) ధనంజయాది లోకపాలకులారా! అదుగో నిశ్శంకగా శంఖ దుందుభి ధ్వానంబులు వినవచ్చుచునే యున్నవి. ఆహా దానవబలంబులతో బలి వచ్చి మనపురంబు జొచ్చియున్నాడు. కాబోలును. "అని దంభోళి నదలించుచు"

సీ. లోకంబులెన్నగా ♦ పాకాసురుని బట్టి
తల ద్రెళ్ళనేయుట ♦ దలపడేమొ
బలిమిచే పయికొను ♦ బల దానవునిబట్టి
తలవి దళించుట ♦ దలపడేమొ
దంభోళికేళి వి ♦ జృంభించు యాజంభ
దంభంబడంచుట ♦ దలపడేమొ
కులమహీధ్రములరె ♦ క్కలుఁ వక్కలుగజీరి
ధరణిపై గూల్చుట ♦ దలపడేమొ

గీ. అట్టి నాచేతినున్న వ • జ్రాయుధంబు
వాడిచెడెనని తలచెనో • వాసవుండు
బలరహితుడంచు నెంచెనో! • భవనమునను
లేనివానిగ దలచెనో ! కానియెడల
బలి మరల నెట్లువచ్చు ది • క్పాలులారా !

దంభోళిచే విజృంభించు నాబారిబడి నిలువజాలక పారిపోయిన నాటిమాట మరచిపోయెను కాబోలును అవురా !

చ॥ బలిమన వీటికేన్ మఱల వచ్చుట చిత్రము వజ్రధారలన్
కులగిరి సంఘమున్ ధరణి కూల్చుచు రెక్కలు వ్రక్కలించునా
బలిమి నెరుంగడో తొలుత బారిని నిల్వక పారిపోవునీ
బలికిపుడింత కల్మియును బల్మియు గల్గుట కేమిహేతువో !
వింటివా వీతిహోత్రా !

అగ్ని—వింటివింటి. నదియే విన్నవించెద

గీ. భార్గవాదుల పాదముల్ బట్టియితడు
విశ్వజిద్యాగమహిమచే వెలయుచుంట
దానవులగూడి మనసుర ధాత్రిపైకి
మఱల నేతెంచె నిప్పుడా మాటనిజము !

కానిమ్ము.

గీ. ఆహవమొనర్ప బలి దానవాధముండు
మఱలవచ్చెను రానిమ్ము మాటలేల
నాలమున నాదుకోపాగ్ని కీలలందు
మిడుతవడువునబడి వాడు మడియకున్నె.

బృందారకాధిపా ! దానవ బలంబులనెల్ల నాదు కోపాగ్ని జ్వాలల పాలు గావింపకుందునా ! యందుకు సందియమొందవలదు.

యముడు—రానిండు రానిండు.

గీ. బలి బలంబుల నలకాల పాశముల
గట్టిగాగట్టి యిట్లట్లు గదలనీక
దండిమీరగ దండింతు దండమునను
మామక పరాక్రమము జూడుమా! మహేంద్రా!

బలి బలంబుల నాలంబున కాలపాశంబులం గట్టి గ్రుక్కుమారుగా బారావారంబున పారవై చెదను జూడుము సుమనోమనోహరా !

వరుణుడు—సురవరేణ్యా! యింతమాత్రంబున నీమనంబున జింతింపవలదు.

గీ. బలిని మరలింతు నాబాహు బలము కలిమి
దనుజలను నాదు పాశాయుధమునకిచట
బలియొనర్చెద బలి మూల బలము బెగడి
బలిబలియటంచు దిశలకు బర్వులిడగ !

ఇంద్రుడు!—లోకపాలకులారా! మంచిది మంచిది. యట్లైనచో మన మందరమిపుడు యుద్ధసన్నద్ధులమై యుండవలయును. మనమన పరాక్రమంబులు దెలియుటకు సమయంబు వచ్చినది.

కుబేరుడు—మహేంద్రా! మున్ను మనచేత నపజయంబునొంది వెన్నిచ్చి బలి మరల నెదిరింప నరుదెంచుట కెద్దియో హేతువు గలిగి యుండవచ్చును. కావున

గీ. ముందుగా నాలమునకిప్డు మోహరింప
పలను సురగురునొకమారు బిలువనంపి
తదనుమతిగొని నడువగా దగును మనకు
నామతము విన్నవించితి నోమహేంద్రా !

అటుపిమ్మట మీచిత్తము కలవుప్రకారము మేమందరమును యుద్ధమునకు సిద్ధముగానే యున్నారము. సందేహ మేమియును లేదు.

ఇంద్ర—అటులనా! రాజరాజా ఆమాట పాటిగానే యున్నది. అటులనే సేయుదము—అని యిటునటు విలోకించి యెవరురా! మనహా జారముసందు (అంతలో)

కంచుకి— (ప్రవేశించి) చిత్తమిదిగో వచ్చితిని త్రిదశాధినాయకా! యేమి సెలవిచ్చెదరు.

ఇంద్రు—నీ వేగి శీఘ్రముగా నస్మదాచార్యుండగువాచస్పతిని దోడ్కొని రమ్ము.

కంచుకి—చిత్తము మహాప్రసాదము నే నట్లనే తోడితెచ్చెదను. (అని వెళ్లును) "అంత నొకశిష్యునితో బృహస్పతి ప్రవేశించును".

ఇంద్రు—"యెదురుగా వెళ్ళి, చేతులుజోడించి"

క. వందనము సురాచార్యా
వందనమిదె మేరుధైర్య భాసురచర్యా
వందనము ఘటితకార్యా
వందనమిదె సుగుణధుర్య భవ్యమహార్యా!

"అని సముచితాసనంబున గూర్చుండబెట్టును."

బృహ—'కూర్చుని' చిరంజీవ చిరంజీవ సుఖీభవ"

ఇంద్రు—ఆచార్య వర్యా! వింటిరా! బలిదానవాధ మునిచర్య.

బృహ—అవునొనతండు. మహాబలపరాక్రమ సంపన్నుడై మరల మన నాకలోకంబు చేకొన దలంచి నందనవనంబున దండువిడిసె నని విని యుంటిని.

ఇంద్రు—అటులనా గురువర్యా! యేమి చిత్రముగా నున్నది.

చ. సురలకునోడి పాఱిదన పెంపును సొంపుదొఱంగి యెచ్చటో
మరుగుచు శౌర్యధైర్యములు మానిఖరావళిలో మెలంగుచున్
దిరిగెడువాని కిట్టి ఘనతేజము నోజమునెట్టులబ్బెదా
మరలను మమ్ము గెల్చుటకు మానుగవచ్చె నెటుల్ గురూత్తమా!

ఆ సంగతి సమగ్రముగా శెలవొసంగుము.

బృహ—అటులనా మహేంద్రా! వివరించెద వినుము.

గీ. భార్గవుని పాదముల్ బట్టి భక్తిఁ గొలిచి
వాని కృపచేతఁ బ్రబల సంపదలనొంది
విశ్వజిద్యాగ మొనరించి వెలసె నతఁడు
వాని గెలువగ దరమె యెవ్వానికైన!

కోటి సూర్యప్రభా విభాసమానుండై కాలాగ్ని రుద్రులచందంబున దేజరిల్లుచున్న వాడతని గెల్చుటకు వాసుదేవునకు దక్క తక్కిన బ్రహ్మ రుద్రాదులకును లోకపాలకులగు మీకును మాకును నలవిగాదు.

ద్విపద.

వినుమింద్ర వీనికీ విభవంబు మరల
ఘన భృగు ప్రవరులు కరుణించియిడిరి
విలసిల్లుచున్నాడు విప్రబలమునను
బలవైభవంబుల బ్రబలియున్నట్టి
బలిపేరు దలపగా వలదిప్పు నీకు
దొలగి యుండుమిటు నీతి దురమొనరింప
వలదిప్డు విమతుల వశముగావింప
దలపుము సురరాజధానిని విడిచి
మెలగుటయే చాల మేలొనరించు
గెలువ గాజాలరు గీర్వాణులిపుడు
విమతులు వెలిగెడు వేళలందొదిగి
సమయంబునను దామె సంగగావలయు
వరల భార్గవశాప వశమున నితడు
సురరాజ్య పదవికి దొరగునందాక
మరలి యుండుమిటుమ్ము మా సమ్మతమ్ము
హరికృపచే రాజ్యమందెదు మరలా!

అదియునుంగాక!

ఉ. వైరుల గెల్చుటొప్పు పరివారలతోడ సమాన లీలలన్
బరగుచు బోరుటొప్పు నని బాయక జచ్చుటయైన నొప్పుగా
కరయగ సంగరంబుల భయంబడి పారిపరాభవంబులన్
బొరయుటగూడ దట్లగుట బోరునకున్ దగదిప్డు వాసవా!

కొంతకాలంబున కీతండు భృగుశాపవశంబున నిందప్రద భ్రష్టుం డగును అంతవరకును మీరలు మారువేషంబులుధరించి కాలక్షేపంబు గావించుటొప్పు.

ఇంద్రు—మహానుభావా! అటులనా! మీయభిమతానుసారంబుగా మే మట్లునే సేయుచుందుము.

యముడు—దివిజ నాయకా! భావికాలగతులు సూచించుచు కార్యాకార్యంబు లెరింగి పలికిన గురువరు వాక్యంబులు మన్నించి మెలగుచుండుటయే మేలు.

వరుణు—విబుధనాథా! మాకుగూడ నట్లుసేయుటయే మంచిదిగాదోచు చున్నది.

కుబేరుడు—గీర్వాణ గణపరిత్రాణచణా అటులయినచో మన మందర మును బ్రతికి మరలనెప్పటికైన నిజరాజ్యపదవిబొందగలుగుదుము.

ఇంద్రు—లోకపాలకులారా! మీ మీ యభిప్రాయంబు లట్లులైనచో నిప్పటికీ త్రివిష్టపంబు విడచి స్వేచ్ఛానుసారంబుగా నభిమతంబు లగు పొందుపట్లకు నేగి యుందమురండు.

లోకపాలకులు—'నలుగురు' ఆలాగుననే సేయుదుము అట్లనేవచ్చెదము.

ఇంద్రుడు—"గురునిజూచి సవినయంబుగా" గురూత్తమా! మే మం దఱమట్లుసేయుటయే మీ ముఖ్యమతమని శెలవిచ్చెదరా!

గురు—అవునౌను! కాకున్నచో నద్దానవేంద్రుని ప్రతాపానల జ్వాలల పాలయి అగ్గిబడి బుగ్గియగు మిడుతల వడువున మడియుచుందురు. అట్టి దుష్టకాలంబు వచ్చినది. అందుకు మీరందరును సంధియము

ఇంద్రుడు—సరే ఆలాగైన పక్షమున మే మీ తక్షణమే సురరాజధాని
విడనాడి యెప్పట్టునకైన జేరవలసినదేకదా !

గురుడు—నిస్సందేహముగా నిప్పటి కిట్లనే సేయదగినది మరల శ్రీహరి కృపవలన నీమహేంద్రపదవి నీవొందగలుగుదు వాదుకు సందేహము లేదు. నేను కాలాగ్నికృత్యంబులు దీర్చుకొనంబోయివచ్చెదను. మీరలందరును కామరూపంబులగైకొని నిజాభిమతాతామను సారంబుగా సంచరింపుడు.

(అని లేచి నడచుచు తనలో.)

యిప్పటినుండి నేనొక బీదబాపనివలె నెచ్చటకేగి యెవనియెదుట పంచాగశ్రవణము చేయవలసి యున్నదోగదా ! మహేశ్వరా ? 'అని వెళ్లుచున్నాడు'.

యింద్రు—లోకపాలకులారా ! మనమును మారువేషంబుల ధరించి చరించుటకు బోదమురండు "అని యిట్లందరు నిష్క్రమింతురు.

ప్రథమాంకము

సంపూర్ణము.



# మహేంద్ర విజయము.

ద్వితీయాంకము ప్రారంభము.

"బలిచక్రవర్తియును తదను చరులును, సుధర్మసభకు ప్రవేశించు చున్నారు"

"విజయశంఖంబు పూరించి వింటినారి సారించి, సాటోపంబుగా"

బలి—దేవాంతక, నరాంతక, ప్రముఖులారా!

దేవా—యేమి! బలిదానవేంద్రా!

బలి—ఆహా! యేమిచిత్రముగా నున్నది! బలపరాక్రమాతి శయంబులు గల మనరాక విన్నంత మాత్రంబున, నాకలోకంబు విడనాడి లోకపాలకులతో గూడ నింద్రుండు పలాయితుండయ్యె! సచివులారా! చూచితిరా!

దేవా—వెరపించి మరపించి నిరాయాసముగా నిపుడీత్రివిష్టపంబు నాక్రమించి స్వవశంబు గావించుకొంటిమి! గదా! దానవేంద్రా!

నర—మీ ప్రతాపానలంబునకు నిలువజాలక చలించి నిలింపులందరును చెట్టాకపిట్టయై! దశదిశలకుం బర తెంచిరి గాన మనకీ నాకలోకంబుచే కూరినది సంకల్పమాత్రంబుననే మీకు విజయంబు సిద్ధించినదిగదా. దానవాధీశ్వరా!

"అంత నొక కంచుకి ప్రవేశించి"

కంచు—తక్‌పీర్, జహాబనా! అఖ్బార్. ఖుషూ, అదబ్, తస్‌విమాస్, బలిచక్రవర్తి మహారాజా! బాదుషా! ఏకఛత్రపతీ! మైబాక్వ సలాం!

1 అమూల్య మణిగణ విరాజమాన కనకవలయాంగద, గ్రైవేయ. హారకిరీటాది మండనమండిత నీలతను వినిందిత తటిల్లతాయుత ఘనాఘన సమాజా! బలిచక్రవర్తి మహారాజా ఫరాక్!

2 నిజభుజార్గళ నిరర్గళ నిర్గళత్పరాక్రమాతిశయ ప్రతాపారుణిత రూక్షేక్షణమాత్ర తక్షణ పరాభూత సురానీక పురందరా పరాక్.

3 ప్రబలారి బలవిలోకన చలత్కాందిసీక బృందారకబృందబంధన నిబంధన ప్రవీణా సురవారపరిపాలన ధురంధరా! పరాక్.

4 దానవానీకా నేకశుభదాయకా పరాక్.

5 వింధ్యావళీ మనోనాయకా పరాక్.

బలి—మంచిది. కంచుకీ! నీవేగి మన హజారమున జాగరికుడవై యుండుమురా,

కంచు—చిత్తము. చిత్తము! (అని వెళ్ళుచున్నాడు).

బలి—ఔరా! యెంత వింతగానున్నది. బృందారకబృందంబు గాందిశీకతనొంది యెందెందుబోయి యణగియుండెనోగాని మనబారి బడువాడు దానొక్కరుండును గానబడడాయెను గదా మంత్రులారా !

దేవా—దేవా! మహానుభావా! అదియొక యబ్బురంబుగాదు!

గీ. విశ్వజిద్యాగమహిమచే వెలయుచున్న
భవ్యతేజోబలంబుల బ్రబలియుండు
నట్టి మీమోల నింద్రాదులనగనెంత
బ్రహ్మరుద్రాదులైనను బరచుచుంద్రు!
అందుకు సందేహముండునా! దానవాధిపా!

బలి—నిజమేకాని! దేవాంతకా! అదియంతయు భార్గవాదుల మహిమావిశేషమేకాని మన పరాక్రమాతిశయంబుగా! దలంచను అది యేమంటిరా !

గీ. తొల్లి సురలెల్ల మనతోడ దురమొనర్చి
విజయమునుగాంచి ముదముతో వెలయలేదె
ఘోరమగు నాలమొనరించి తుదకు మనము!
విముఖతను జెంది రాలేదె! నెరపుమీాఱ!

మన బలరాక్రమంబు లపుడేమైన వినియోగించెనా మంత్రులారా

దేవా—దానవాధిపా! నిక్కమే వక్కాణించితివి! జయాపజయంబులు దైవవశంబులు గాని మనవశమేమున్నది.

బలి— దైవ సాహాయ్యంబు గలుగుటకుగూడ బ్రహ్మ తేజోబలంబె బలంబుగా భావించుచుందును.

ద్విపద.

సర్గంబునకు మారుసర్గంబుసేయు ♦ భార్గవాదులజేరి భజియింపవారు
విశ్వాత్మకునిగూర్చి విధిపూర్వకముగ ♦ విశ్వజిద్యాగంబు వేట్కసేయింప
భవ్యకాంచనపట్టభద్ర రథంబు ♦ భవ్యతురంగముల్ బాణాసనంబు
దివ్యతూణయుగంబు తీవ్రబాణములు ♦ భవ్యకంఠీరవధ్వజము కవచము
వరదుడై యల హోమ పావకుండిచ్చె ♦ వరపద్మమాలిక తాతయొసంగె
చంద్రసకాశంబౌ శంఖంబు ప్రేమసాంద్రుడై మామకాచార్యుడొసంగె.

అపుడు.

మ. బహుదానంబులొసంగి భూసురులచే బల్మారు మెప్పొంది త
త్సహితాశీర్వచన ప్రభావముననే మాన్యుండనై పెద్దలన్
విహితాసక్తి భజించి దైవతములన్ వేమారుబూజించిత
న్మహిమన్ గాదె జయించితిన్ రిపుల మీసామర్థ్యముల్ దోడుగాన్!

దేవా— దేవా! సకలలోకవిదిత ప్రభావా అది యంతయు నిజమేకాని మా సామర్థ్యమన నెంత! మీదేవ బ్రాహ్మణ భక్తిపరాయణత్వమే మీకిట్టి శక్తియుక్తులను గలిగించినది.

క. గోవులను పరమసాధుల
పావనులగు భార్గవులను బ్రాహ్మణులను సం
భావించుచు కేవలముగ
దైవములని కొల్తువీవు దానవనాథా!

కాబట్టియే మీకిట్టి దివ్యవైభవంబు చేకూరినది!

నరా— గీ. యింద్రుడని గొప్పగా జెప్పుచుందురేకాని
ధూర్తునకు ధర్మబుద్ధి యింతైనలేదు

భాగ్యభోగ్యములను చాల బ్రిబలుచుంట
గర్వమెసల్పె నెన్నెన్నొ కాని పనులు'—

రూపయౌవనతారుణ్య లావణ్యాదులుగల రంభాది వారనారులతో దనివి సనక జారుడై వాడిజెడకోడిమైయెకూసి వాసినెడవాసి గౌతమ పత్నితో రమించి తాశాపమొందుటయే గాక ! యా మహాపతి వ్రతయగు నహల్యకుంగూడ గీడు మూడజేసెను ! ఆమాట లోకంబులకెల్లఁ దెల్లంబే కదా?

దేవా—అది యట్లుండనిమ్ము ! అది గాక !

గీ. తన దుర్వైభవ మెప్పుడో దలగుననుచు
యోచి యెచటనో తపమాచరించుచున్న
విప్రుడగు విశ్వరూపుని వెనుకజేరి
వాని శిరమునుద్రుంచెనా వాసవుండు !

అపుడా విశ్వరూపుని తండ్రియగు త్వష్టబ్రహ్మచేత నింద్రత్వంబున కనర్హుండుగా శపియింపబడి మహాపాతకంబును వహించె

"ఆ మాటలువిని"

బలి—గీ. అతడొనర్చిన పాపకృత్యములకెల్ల
దగిన శాపఫలంబులు దవిలి యతని
కట్టికుడిపిన వవిదలపెట్టరాదు
దీనుడైపోవు రిపుని నిందిపదగదు !

దేవా—దానవేంద్ర ! నిజము నిజము ! "యతో ధర్మ స్తతో జయ మను"నట్లుగా ధర్మతత్పరుడవగు నీకు జయముగలుగుటయు అధర్మ పరాయణుండగు నత డపజయ మొందుటయు జూడబడుచునే యున్నది ! యిక వేర వచింపనేలా ! దనుజపాలా !

నరా—బ్రహ్మవాదులగు బ్రాహ్మణుల యాశీర్వచనంబు లమోఘంబులై మీకు మేలు గలుగఁజేయుటయు, శాపవాక్కులు నిక్కంబులై వానికి గీడు మూడజేయుటయు, గానబడుచునేయున్నది. వేర యెన్న నేలా! నిత్య సత్యానుశీలా!

బలి—సరే దానికేమి! గాని యీమాట లట్లుండనిండు నిష్కంటకంబుగా దిక్పాలకాధిపత్యంబు నొంది. సుధర్మాధిష్ఠితుండనై యున్న నాచేత బలిపాలితంబగు నిలాతలంబున

శా॥ శ్రీరంజిల్లునె యెల్లవారు సుఖులే! క్షేమంబుగా జన్నమున్
పారుల్ సేయుచునుంద్రె పుష్కరముగా వర్షించునే మేఘముల్
సారోదంబులె వాహినుల్ పుడమి దానసత్యధ్యయే దేవతా
గారంబుల్ నిరతోత్సవంబులె బుధుల్ కళ్యాణసంపన్నులే!

అన్నిటం గుశలంబుగలిగి వెలయుచున్నదే సచివులారా!

దేవా—అందుకు సందేహమేమున్నది. దానవాధిపా!

మ. సిరులన్ గాంచిరి మానవుల్ సుఖములన్ జెన్నొందిరా దానవుల్
ధరణీదేవుల యజ్ఞముల్ దనరునా, ధారాధరంబుల్ తటిన్
గురియున్ సస్యములున్ ఫలించు నొసగున్ గోవుల్ బహుక్షీరముల్
పరిపూర్ణంబులు వాహినుల్ సుగుణసంపన్నుల్ వదాన్యుల్ బుధుల్,

నీవేలు రాజ్యంబున నెల్లవారలు నాయురారోగ్యములు గలిగి ధనధాన్య సంపదల బెంపొందు వారలేకాని దీనజను లెచ్చటను గానరారు! మహాత్మా!

నరా— నీచేత పరిపాలితంబగు నిలాతలంబున నెల్లవారలు నిరంతరంబు పండువుగా నిండువేడుక గనుచుండిరి దేవా!

బలి—మేలుమేలు! మంత్రులారా!

గీ. సాధుబాధనుగావించు జారచోర
గణములనుబట్టి గర్వంబు లణచుచుండెరి
ఘోరకృత్యంబులొనరించు వారినడచి
ప్రజలకెల్లను బన్నముల్ బాపుచుంద్రె.

దేవా—క. క్రూరత్వము జారత్వము
చోరత్వముగలుగు జనులు జూడంబడరే

ధారుణికి దూరముగ జని
మారీదుర్భిక్షభయము మహితచరిత్రా!

నీప్రభుత్వంబునం దెవ్వారికినిగూడ! క్షామ డాంబరాదులవలన బాధలుగలుగుటయే లేదు మహానుభావా!

బలి—ఆహా అట్లాగుసేమి! మంత్రిశేఖరులారా! సరేకాని మన సేనా సమూహములును బాధుమిత్ర పురోహితాశ్రిత వర్గంబులును! క్షేమముగలిగి వెలయుచున్న వేకదా?

దేవా—చిత్తము! దేవరకటాక్షముచే నట్లనే వెలయుచున్నవి! దైత్యోత్తమా?

బలి—యిపుడు కవిగాయక నాటకపాఠక వాంశిక వైతాళిక మార్దంగిక, పరిహాసక పౌరాణిక విద్వన్మహాజనులు మన సభనుబరివేష్టించి యుంచిరా యమాత్యులారా!

నరా—చిత్తము చిత్తము! మనసుధర్మ. సభా సప్తాంగలక్షణ లక్షితంబై సుధర్మగా వెలయుచున్నది.

బలి—అటులైనచో! నిపుడొకసారి! మనమానసంబులు బల్లవింప నెల్లవారల హృదయంబులు రంజిల్ల రంభాది సురవారాంగనల చేత గీతంబుసేయింపుడు! వారి వారి యాటపాటలు, గని విని సంతసింతము.

దేవా—చిత్తము దైత్యోత్తమా? ఆలాగునే సేయించెదను.
“అని”

యెవరురా మన హజారమునందున్నవాడు!

“అంతలో నొక కంచుకి ప్రవేశించి”

కంచుకి—చిత్తము. ఇదిగో వచ్చితి నేమి శెలవిచ్చెదరు!

దేవా—నీవేగి వేగమ్మునా రంభాదివారాంగనలను దోడితెమ్ము పొమ్ము.

కంచుకి—చిత్తము మహాప్రసాదము నేనట్లనే, తోడితెచ్చెదను, “అని వెళ్ళును”

“అంతలో రంభయు నూర్వశియు గానముజేయుచు ప్రవేశించుచున్నారు”

హిందుస్తానీ కాఫీ—ఏకతాళము.

రమ్మనవే సఖి రమ్మనవే రాజశేఖరుని ॥రమ్మ॥

1. రమ్మనవే తన సొమ్మనవే మన సిమ్మరవే మేలుకొమ్మనవే
కొమ్మ ॥రమ్మ॥
2. నేరములెంచుట మేరగాదనినెన రూరగబల్కి నీ నేరుపుమీరగ ॥ర॥
3. సారెకుబువ్వుల కోరులజీరెడు మారుని బారికి నేనోరుతు ॥రమ్మ॥
4. గంగాతరంగణి సంగతిగాంచి మెలంగుచునున్న సారంగధరునిటు ॥ర॥
5. వందనములనిడు సుందరకవిని సానందముగానేలు నిందుధరు
సుందు ॥రమ్మ॥

"అని యాడి పాడి యభినయించి పుష్పాంజలులిచ్చుచున్నారు"

బలి—ఆహా! యీనెలవెలను కలిపుడెంతో! వింతగా వెలలేని
గానంబు గావించిరి !

"యిట్లని మంత్రులంజూచి. ప్రకాశముగా"

ఉ. గాయనగాయనీ మణుల గానములెన్నియొ మున్నువింటిమే
చాయలనైన నిట్టిదగు శ్రావ్యముగల్గెనె వీనుదోయికా
హాయిపుడెంతొ వింతగను హాయినిసేయుచు నాడిపాడిరే
తోయరుహాననల్ ముదముతో గడురంగును రక్తిసేయుచున్

వీరియాటపాటలు మిగుల సభారంజకంబు గావించినవిగదా!
కావున నీపాటివారి యాటలకు దగిన బహుమానంబు లిప్పించి
యంపించు డమాత్యులారా!

దేవా—చిత్తము వీరలీరీతినే తటెందమ కొలువుపట్టుననిట్టి మనోవినోదం
బులు సేయదగిన వారలేయగుదురు గాన వీరిగానంబుకనుగుణం
బులగు పారితోషికంబు లిప్పించి పంపించెదము.

'అని వారలకు తాంబూలజాంబూనదాంబరాదులిప్పించి పం
పించుచున్నారు' "సంతసించుచు చక్కగా మ్రొక్కి రంభోర్వ
శులు వెళ్లుచున్నారు.

బలి—మన కులాచార్యుండగు శుక్రాచార్యులం బిలువనంపుడు సచివు
లారా !

దేవా—చిత్తము. అట్లనేసేయుదుము (అని) యెవరురా మనహజారమునం

కంచుకి—ప్రవేశించి యిదిగో వచ్చితి నేమి శెలవు !

దేవా—వేత్రహస్తా! నీవేగి వేగముగా శుక్రాచార్యులం దోడ్కొనిరమ్ము!

కంచుకి—చిత్తము నేనిపుడే తోడ్కొని వచ్చెదను (అనివెళ్లుచున్నాడు)

"అంతలో శిష్యునితోగూడ శుక్రాచార్యుడు ప్రవేశించుచున్నాడు"

బలి—కృతాంజలియై లేచి

క. కావ్యాత్రిభువన జనసం
భావ్యాదితి జాతసేవ్యపరి కల్పిత స
త్కావ్యా మద్వందనములు
దీవ్యత్కృపతో గ్రహించి దీవింపుమికన్!

"అని నమస్కరించుచున్న బలిచక్రవర్తిని జూచి"

శుక్ర—చిరంజీవ ! చిరంజీవ! సుఖీభవ ! నిరతారోగ్యమస్తు ! నిత్య కళ్యాణమస్తు సమస్తమంగళానిభవంతు !

బలి—ఆచార్యవర్యా! యీసముచితాసనంబు నలంకరింపుడు.

"అని వేత్రాసనంబున గూర్చుండబెట్టుచున్నాడు"

శుక్ర—"అటు గూర్చుని" స్వవశీకృత సురేంద్రవై భవసాంద్రా! బలి దానవేంద్రా !

గీ. నీదుకోర్కెలు నేటికి ♦ నిక్కముగను
సఫలతను జెందెనేకద ♦ జగములెన్న!
నన్నురమ్మనునది దెల్పు ♦ నయముమీఱ
సాంద్రతరకీర్తి! బలి దైత్య ♦ చక్రవర్తి !

నీ బలపరాక్రమాదులం జూపి బృందారక బృందంబును గాంది శీకతనొందించి యమరధాని రాజధానిగావించుకొని యిపుడీసుధర్మాసభాధిష్టితుండవై త్రివిష్టపంబు నేలుచుంటివిగదా?

బలి—చిత్తము చిత్తము గురూత్తమా? మీ యాశీర్వచనమహిమా విశేషంబువలన జయము గలిగినది. నా మనోరథంబులు సఫలంబులైనవి. యీ వైభవంబెల్ల మీకృపాయత్తమై యున్నదే కాదా! మరల నన్నడుగనేల! అదియే విన్నవించెద వినుండు.

"అని వినయముగా"

సీ. భార్గవా! మీసత్ప్రభావంబుచే నిట్టి
బలముగల్గుటవిని పరచిరేమొ
విశ్వజిద్యాగ సద్విలసిత సంపదన్
వెలయుచుండుట విని వెరచిరేమొ
హోమపావకు డిచ్చు హైమరథాదులే
నొందుట విని భయమొందిరేమొ
బ్రాహ్మణాశీర్వాదబలముచే పటుతర
శక్తి గాంచుట విని సడలిరేమొ.

గీ. భీకరంబగునట్టి మా రాకవినియె
పీకజెడి శ్రీకరంబగు నాకమెడలి
యేకడకుబోయి జోగిరో యింద్రముఖులు
చూడబడడాయె నొకడైన చోద్యముగను

ఆహా యేమిది గురువర్యా! మీ యాశీర్వచన రచనావిశేషము నే నేమనివినుతింతును మీ సామర్థ్యము మిగుల నబ్బురముగా నున్నది మహేంద్రాది లోకపాలుర నందఱం బాఱదోలి యీ మహేంద్ర వైభవం బనుభవించుట భవదనుగ్రహముచేతనే గదా మహాత్మా!

శుక్రా—దానవేంద్రా! నిజమునిజము నీ కట్టిభక్తివిశ్వాసంబులు గలిగి యుండుటచేతనే నీకోర్కెలెల్ల సిద్ధించుచున్నవి నిక్కమే। వక్కాణించితివి! అది యట్లనే!

క. గురుమతితో నిజగురులను
గురుజనులను విప్రవరులగుల దైవములన్
నిరతమును గొలుచువారికి
చిరసంపద లొదవు టేమిచిత్రముచెపుమా?

దైత్యోత్తముః—నీవునావంటి పెద్దలయెడల విధేయుండవై వినయముతో గ కివిశ్వాసములుగలిగి వెలయుచుండుటం జేసియే యిట్టి వైభ

వంబు నొందుటకు బాతుండవైతివి అందుకు సందేహ మేమున్నది అది గాక త్రిలోకాధిపత్యంబునహించి సుధర్మాధిష్ఠితుండవై ధర్మాధర్మంబులు బరిశీలించుచు నీవేలు రాజ్యమునందిపుడు.

శా. అర్థుల్ వేడరు దాతలున్ జడరు సర్వారంభముల్ పండు ప్ర
త్యర్థుల్ లేరు మహోత్సవంబులను దేవాగారముల్ వొల్చు బూ
ర్ణార్థుల్ విప్రులు వర్షముల్ గురియు గాలార్హంబులై ధాత్రికిన్
సార్థంబయ్యె వసుంధరత్వ మసురేంద్రాధీశు రాజ్యంబునన్॥
అని సంతసించుచు నెల్లవారును వినుతించుచుండిరి! సుమా!

ప్రజానురాగమే ప్రభుత్వంబునకు మూలమై వెలయుచుండునుగదా?

బలి—చిత్తము గురూత్తమా దీని కంతకును మీ యాశీర్వచనప్రభావమే ముఖ్యహేతువుగా భావించుచున్నాడను.

శుక్ర—దానవేంద్రా! నీవట్లు భావించి సేవించుచుందువుగనుక నే దానికనుగుణంబుగ నీ మనోరథంబులు ఫలించుచున్నవి.

గీ. విశ్వములు దైవవశములై వెలయునతడు
మంత్రవశవర్తియై యుండు మహితమంత్ర
మవనిసురున కధీనమై యలరువాని
దైవమని కొల్చువారలే ధన్యతములు

కాబట్టి బ్రాహ్మణాశీర్వచన పాత్రులగుమీబోట్ల కేమేమి మేళులొందవుచుండవు దానవేంద్రా!

బలి—చిత్తము మహాప్రసాదము గురూత్తమా!

గీ. మహిమ రహిమీరు మీ యనుగ్రహమువలన
రాజ్య సామ్రాజ్య సంపదల్ బరగుచుండ
నేంచి ముజ్జగములను బాలించుచుంటి
దశదిశాభోగ విశదమౌ యశమెసంగ॥

మీయనుగ్రహంబున నెల్లవారును మదాజ్ఞానువర్తులై మెలగుచుండ ముజ్జగంబులు నావిగా భావించుచుంటి నాచార్యవర్యా!

శుక్ర—నీగుణసంపద కనుగుణంబుగా నెల్లవారును వశవర్తులై భయభక్తులతో సేవించి భావించుచునే యుందురు అదియొక యబ్బురంబుగాదు.

గీ. ఆజ్ఞయును గీర్తియును బ్రాహ్మణావనంబు
దానమును భోగమిత్ర సంత్రాణనములు
గలిగి విలసిల్లవే, ధరాకాంతునందు
వ్యర్థమగు గాదె వానివైభవము భవము॥

కాబట్టి యీమద్గుణంబులు నీచిత్తవృత్తి కనుగుణంబులై యుండగా నీశాసనంబును బూలమాలికవలె నెవరు శిరంబునధరింపకుందురు

బలి—చిత్తము తమ కటాక్షవీక్షణ మట్టిదియే కాని నామనవి యొక్కటున్నది విన్నవించుకొనెద నన్ను మన్నింపుడు.

శుక్ర-అటులనా! దానవోత్తమా! నీయభీష్టసిద్ధింగావించెద వివరింపుము.

బలి—కృతాంజలియై వినయంబున

చ. సతతము భాగ్యభోగ్యములు శాశ్వత సంపదలున్ జెలంగగా
శతమఖుడంచు నెంచదగు సార్థకనామముగల్గు లీల మీ
యతులిత చాతురిన్ భగవదర్పణగాగ శతాశ్వమేధ స
త్క్రతువులొనర్పజేసి నను ధన్యునిసేయుము సద్గురూత్తమా.

మీదయవలన నెద్దానంగొరంత లేదుగాని శాశ్వతసుఖంబు లనుభవించుచు శతక్రతుండ ననుపించుకొనుట కభిలషించితిని నన్ను మన్నించి యట్లనుగ్రహింపుడు.

శుక్ర—(తనలో కొంచమాలోచించుకొని ప్రకాశముగా) అలాగునా బలిదానవేంద్రా! దానికేమి నేనట్లనే సేయించెదను గాని అశ్వమేధశతంబు నిర్విఘ్నంబుగా సాగి సంపూర్తి యగునేని శతక్రతుండ వనిపించుకొనెదవు. అందుకు సందేహము లేదు! నేనందునకే యాలోచించుచుంటిని.

బలి—మహాత్మా! చాష్షష్టికలానిధులగు మీరు సంకల్పించి సేయించుచున్నపుడో నెందుకు సాగకుండును గురూత్తమా?

శుక్రి—నా మాట జవదాటకున్నచో నేనట్లనే సేయింతును కానిమ్ము దానికేమి యిపుడాలోచించవలసినదిగాదు! అట్లు నెరవేరునేని నాకలోకంబునకు నీకుపట్టాభిషేకంబు గావించుటే నిజము "అని వెనుకకు దిరిగి తనలో" అట్లుజరుగకున్నచో నక్కడనే పెక్కు చిక్కులున్నవి "అని శిష్యునవలోకించి" శిష్యా! అవుగా! ప్రిమత్తా! విన్నావురా?

ప్రిమ—మీరనుకొన్న మాటగూడ నే వినుచునేయున్నాను.

శుక్రి—దానికేమిగాని బలిచక్రవర్తి కోరినకోరిక మాత్రము సామాన్యమైనదిగాదు దుస్తరంబగు కార్యంబు సేయందలంచినాడు యెట్లగుచుండునో యని సంశయించుచున్నాను.

ప్రిమ—చిత్తము గురువర్యా! త్రికాలవేదులు తమరనుగ్రహించినచో నెట్టి యసాధ్యంబులగు కార్యములైనను నెరవేరకుండునా.

శుక్రి—సరే దానికేమిగాని పెద్దవాడనై నానుగదా!

ప్రిమ—ఔనౌను! రాజాజ్ఞయైనదని వేగముగా నడువజాలక పరుగెత్తి వచ్చితిరేకాని మీశరీరమం దెచ్చటను డబ్బెత్తు సత్తువలేదు! శరీరమంతయు మెత్తగను తలగట్టిగనున్నది. మోకాళ్లు ముందరకును మోచేతులు వెనుకకుంబోయినవి. ఆమాటలంతా యెరిగినదేను అదిగాక మాటలాడుచో నాలుకమాటిమాటికిం గదలుచున్నదని యిదివరకే జెప్పియుంటిరి. మునుపు తెరచాటు మనిషి కొంచెము లీలగా కన బడుచుండేవాడు గాని యిపుడు గోడచాటుమనిషి బొత్తిగా గానరాకున్నాడంటిరిగాదా! కన్నులు మసకలారుచున్నవి గాబోలును. దూరమందున్న దున్నపోతువలెను. దగ్గరనున్న నల్లబూస లావగింజలవలెను గానుపించునని శెలవిచ్చితిరి. యిపుడొక చెముడుకూడా సంభవించినదది యేమనగా దూరముగా నాడుకొనెడు మాటలుమాత్రమే వినవచ్చునుగాని నామెదుట జెప్పునిమాటలు నాకు వినరాకున్నవని యిను అదిగాక! పగటిపూట వెలుగుగను, రాత్రిపూట చీకటి

గను కనిపించుచున్నది. దృష్టి విశేష మీలాగున్నదనియును శెల విచ్చితిరి! అదిగాక తమకు దంతబలిమికూడా తప్పిపోయినది. వేచిన యనపగింజలు, మినపగింజలును నమలెద రేకాని! పలు చని పాయ సాన్నాదులు నమలి మ్రింగలేరుగదా! మీకు భోజ నపుష్టికూడా మునుపటికన్న చాలా తగ్గిపోయినది. యేమనగా బండికుంచముతో రెండుకుంచముల బియ్యము పారతూముతో పదతూముల కందిపప్పును వండివడ్డించినట్లైతే తొలికన్న మలి మలికం టెమూరు, మూరంత చారులోను, మరంత మజ్జిగలోను వడ్డించుకొని తినడమేకాని, మానడంలేదు! బొత్తిగా అన్నహిత వు లేక పోలేదు! అందుచేతనే యీమట్టుకునైనా పని జరు గుతూవున్నది! అది అట్లుండగా! తెల్లవారు ఝూమున లేచి చేసుకొనవలెనుగదా! స్నానసంధ్యాద్యనుష్టానములు. అట్లను ష్ఠింపదగిన కృత్యంబు లెట్లుమానును: కాబట్టి లేని యోపికనైన నను తెచ్చుకొని గృహకృత్యంబుల నెరవేర్చుచుందురు.—

శుక్ర—ఆమాట నిజమేను! కాని నేనిట్టి యోపికలేని స్థితిలోనున్నను యీ బలిచక్రవర్తిచేత శతాశ్వమేధ యాగంబులు సేయించు టకు సంకల్పంబు సేయింపక తప్పదు.

ప్రమ—ఔనౌను! నిక్కమే వక్కాణించితిరి! మీకు బొత్తిగా మును పటివలె దారుఢ్యములేదు. సత్తువ తగ్గిపోయినదిగాని యెట్లయి నను కొంచెము శ్రమపడి ఆపని సేయవలెనుగాని, మానరాదు గురూత్తమా!

శుక్ర—సరే ఆలాగుననే కానిమ్ము! నేటిరోజున దినశుద్ధి యెట్లుండు నో! పంచాంగమును పరిశీలించి కొంచెము వచించుము!

ప్రమ—"చిత్తము. ఆలాగుననే" అని పంచాగమునుబట్టి చింపబోవును"

శుక్ర—అదేమిరా శిష్యా! వచించుమంటే చించుచున్నావు మంచి ప్రబుద్ధునివలె నున్నావుసుమీ!

ప్రియ— చిత్తము ఆలాగునా! నిద్దరమత్తుచేత తెలిసినదికాదు! యిదుగో చదివెదను! "అని పంచాంగమును తిరుగు మరుగులుగా రెండుమూడు సారులు చూచి"

స్వస్తిశ్రీ విజయనగర సాలివాహన శగగతాబ్దాః। ముప్పదినాలుగు వేల మున్నూట ముప్పది యారుంబరకా మూడు మాసాలు। సురాపానగతాబ్దాః। పదహారువేల నన్నూట పరుకొండున్నరా మూడు వాసాలు। సముద్రిమానేన వర్తమాన ఖరనామ సంవత్సర। మేకమాంసం। అరవై ఆరోతేదీ గుద్దులాటసిద్ధి। కొత్త మంగలివారము లక్క బరణీ నక్షత్రిము. మూడుకాసుల ముప్పాతికా చందిరినామయోగము, పదిన్నరానాలుగుపరకలు। పిశాచకరణం। యిరవై రెండున్నరా నేటికి రెండుగోజుల క్రింద టనే దివారాత్రిలుసున్న। యీరోజున అంతా వట్టిదే! రేపు సర్వశూన్యము యెల్లుండి కేమియులేదు॥ ఆవలనాడు రాత్రిఆరు ఘడి యలన్నరకు కన్య మూలగదిలో ప్రవేశించగా। తెల్లవారు ఝామున రెండు హస్తములమీద రెండుపాదములు క్రిందనుండగా। మిథునలగ్న సమయమునందు త్యాజ్యము మెల్లమెల్లగా తెల్లవారి జారిపోవు చున్నది—రాహుకాలము మాకూలేదు మీకూలేదు మనపగ వారింబట్టి బాధించుచున్నది. వారశూల మన వైరులకే తగులుచున్నది. అన్నికార్యములకు రేపులబలబ తెల్ల వారగానే కుంభానకు అనుకూలముగా నున్నది సర్వే విగ్రహ శుభకాశీస్నాన ఫలదాభవంతు మనోవాంఛా ఫలసిద్ధిరస్తు! ఆయు రారోగ్యాభివృద్ధిరస్తు. మీఆశ్రితులము. మీతప్పులన్నియు మా యొప్పులుగానెంచి భరించుము. దైత్యోత్తమా? అదిగో అంతా యిక నేమిశెలవిచ్చెదరు! గురువర్యా!

శుక్రా—చాబాసురా ప్రమత్తా! సణిగి కొణిగి! తడుములాడుచుఁ తడ బాటు మాటలతో తుదకు బాగుగానే చదివి చెప్పితివిసుమీ?

ప్రియ —యింకా నయము గురువుగారూ? పంచాంగము వ్రాతది ఆపైని వ్రాతది. అందుపైని నిన్ననే వర్ణంవేయుటచేత అక్షరములన్నియు

నలుక్కుపోయినవి. నేను కాగానే యింతమట్టుకైనను చదివి చెప్పితిని.

శుక్ర—అవునయితే సరే! బాగుగానే చెప్పినావు. అనుకూలముగానే యున్నది. "అని బలిచక్రవర్తిం జూచి"

బలిదానవేంద్రా! మంచిరోజు విచారించి శుభముహూర్తమెంచి శతాశ్వమేధంబులు చేయించుటకు సంకల్పంబు చేయించెదను నీమనోరథంబు సఫలంబు గావించెదను. యిప్పటికి సంధ్యావందన సమయమయినది గావున కాలార్హకృత్యంబులు దీర్చుకొనుట కేగి వచ్చెదను.

బలి—చిత్తము గురూత్తమా? అట్లనే వెళ్ళిరండు!

"మంచిదని శిష్యునితోగూడ శుక్రాచార్యులు వెళ్ళుచున్నారు"

బలి—దేవాంతక నరాంతక ప్రముఖులారా?

దేవ—యేమి శెలవు దానవేంద్రా!

బలి—మనముగూడ నిప్పటికి గాలార్హవిధులు దీర్పం బోయివత్తము లెండు.

అని అందరును వెళ్ళుచున్నారు.

ద్వితీయాంకము సంపూర్ణము.



# మహేంద్రవిజయము.

## తృతీయాంకము.

(కస్యప బ్రహ్మయును నతిదియు చెలికత్తెయును బ్రవేశింతురు).

కస్య—"దీనవదనయగు తన మగువం జూచి"

మగువా! నీవీలీల! మిగుల వగల బొగులుచు నెగులొందు చుంటివేలా! నీ వెందుకీ చందంబున గుందుచుందువు సుందర వదనా "అని చెంతజేర్చికొని" "చుబుకంబు పుణికి ముద్దు పెట్టుకొని మఱల"

సీ॥ ముద్దుగుల్కెడు నీదు మోముచందురునందు
చిరునవ్వు వెన్నెలన్ జెలగవేల
వదనాబ్జమున వ్రాలు మదషట్పదము లీల
గస్తూరి తిలకంబు గ్రాలదేల
గిరులపై బారు నిర్ఝరులట్లు కుచములన్
దారహారంబులు దనర వేల
నల్లమబ్బునమించు నల్లమించుల లీల
గొప్పుపై విరిదండ లొప్పవేల
గీ॥ యంబరము తారకలతోడ నలరునట్టుల
నడుము మొలనూలి మువ్వలన్ బడయవేల
కలికి పలుకుల సుధజిల్క బలికి కలికి
యొప్పుమీరగ ముచ్చటల్ జెప్పవేల!

"ఆమాటలు విని యదితి కన్నీరునించి మిగుల వగచుచు మారు పలుకకున్నది"

కస్య—నీవిట్లు చింతించుట కేమి హేతువు బదులు పలుకవేలా! తెలుపకుండుట మేలా? యబలా శిరోమణీ!

ద్విపద.

కౌతుకులు గోడండ్రు గూర్మినీమాట
కడుగుదాఁక భక్తి నాదరించెదరె
బిడ్డలందరు నీకు వెరచు చుండెదరె
అడ్డుసేయక భృత్యులాజ్ఞ సల్పుదురె
తనయులు ధర్మముల్ దప్పకయుండ్రదే
యనువుమీర గృహస్థు లగ్నివేల్చెదరె
సరవి దేవార్చనల్ జరుగుచునున్నె
ధరణీసురులపూజ దవిలి సేయుదురె
ధన ధాన్యసంపదల్ దరుగకయున్నె
యనిశంబు నతిథుల నభ్యాగతులను
మన్నించి యాయాచ మానమానవుల
కన్నపానీయంబు లరసి యిచ్చెదవె
పరమ సాధులనాచి పాలించుచుండె
హరిదాస జనముల నాదరించెదవె
అఖిల దేవాత్మకుడైన యాహరికి
శిఖియును భూసురుల్ జెలగ మోమాట
వారు సంతుష్టులై బరగుచునున్న
వారిజాక్షుడు దృప్తిబడయు మృగాక్షి
వ్యాధులేమైనను బాధించుచున్నె
యాధినొందగ హేతువది దెల్పుమబలా ?

అదితి—ప్రాణనాథా నామనోవ్యధ మీకెంతని విన్నవింతును. తపః ప్రభావ సంపన్నులగు మీ కెరుంగరాని దేమున్నది ! నావలన విన దలంచి నన్నిట్లడుగుచుంటిరేకాని మీ రెరుంగనిది కాదు అయినను విన్నవింతును మన్నించి యాలకింపుడు. మనోహరా ?

ఉ॥ ప్రేమ యొకింత లేక దితి బిడ్డలు బిడ్డల బిడ్డలున్ మహా
భీమబలాఢ్యులై తనదుబిడ్డల నందఱదోలి సాహసా

క్రిమిత వైరులయ్యు నమరావతి నేలుచునున్నవారు నీ
కేమని విన్నవింతు హృదయేశ్వర మేలుదలంచి చూడవే !

అక్క జెల్లెండ్రమై యున్నందుకు నెనరు దక్క దితియును నామె పుత్రపౌత్రులును నాపుత్ర పౌత్రులం బట్టికొట్టి పెక్కు యిక్కట్ల పాలుగావించి యమరావతి నాక్రమించి యేలుచున్న వారు ఆమె తానీదురంతమంతయుఁజూచి యూరకొనుటయైన నుగాక తనతనయుల హెచ్చరించుచు మాపైని మచ్చరించు చున్నది. యికనేమని మనవిసేయుదును మహాత్మా !

సీ॥ ఎందఱన్నరుగని యింద్రుని యిల్లాలు
పలుపంచలను జాలిబడియె నేఁడు
త్రిభువనసామ్రాజ్య విభవంబు గోల్పోయి
దేవేంద్రుడడవుల దిరిగె నేఁడు
కలిమి గారాపుబిడ్డలు జయంతాదులు
శబరార్భకులవెంట జనిరి నేఁడు
నమరుల కాధారమగు నమరావతి
యసురుల కాటపట్టయ్యె నేఁడు.

ఆ॥ వె॥ బలిజగములనెల్ల బలియుచున్నాఁడు
వాని గెలువరాదు వాసవునకు
యాగభాగమెల్ల నతఁడాహరించును
గడగి సురలకొక్క కడియు నీడు !

కాబట్టి ప్రాణనాథా !

కం॥ ప్రజలకు నెల్లను సముడవు
ప్రజలను గనుపారగన్న బ్రహ్మవు నీవున్
బ్రజలందు దుష్టమతులను
నిజముగ శిక్షింపవలదె నీవు మహాత్మా !

ఏ నందుకై గుందుచుందును హృదయేశ్వరా !

మ॥ సురలన్ సభ్యులనార్తులన్ విరథులన్ శోకంబువారించి ని
ర్ఘర ధారన్నిలువంగ ధాత్రిచరులన్ శాసింపన త్కార్యమే

వెరవేరీతి ఘటించునట్టి క్రమమున్ వేవేగ జింతింపవే
కరుణాలోక సుధార్ఝరిన్ దనుపవే కళ్యాణ సంధాయకా !
ప్రాణనాయకా యీచింతవాయుట కెద్దియైన వెరపుజూపుము.
"విని తనలో ముహూర్తమాత్ర మాలోచించి"

కస్య—కాంతా నేనెంతయున్ దివ్యదృష్టినవలోకించితి నదియంతయు నిజమేగాని తెలివిగలిగి మెలగెడు నీవుగూడ నిట్లు జింతించుట యుక్తమగునే యేనొకటి జెప్పెద నిటువినుము.

మ॥ జనకుండెవ్వడు జాతుడెవ్వడు జనిస్థానంబు లెచ్చోటు సం
జననంబెయ్యది మేనులేకోలది సంసారంబులే రూపముల్
పినుమాయింతయు విష్ణుమాయ దలపన్ వేరేమియున్ లేదుమో
హానిబద్ధంబిది మూలమింతటికి జాయావిన్నబోనేటికిన్.

ప్రాజ్ఞతగలిగి వెలయుచుండు నీవింతమాత్రంబున కిట్లు జింతింపదగునే ప్రాణనాయకీ ! తెలియబలికెద వినుము.—

గీ॥ పూర్వభవ కర్మవశమున బొందుచుండు
జీవులను సుఖదుఃఖముల్ సిద్ధమగుచు
నితరు లొనరించిరని మదినెంచియిటుల
గుందుటజ్ఞానమగు సుమ్ము కోమలాంగి !

జన్మాంతర కర్మవశంబునంజేసి జీవులకు కీడుమేళ్ళులు సంభవించుచుండును. సుఖదుఃఖంబు లొదవించుటకు బెరవారలెట్లు కర్తలగుచుందురు నీవందుకై యజ్ఞానంబు నెలకొని తెలివిదక్కియిక్కవశి చొక్కుచుండ దగునే ! యావంత యావంత వలువదుడుగుము ప్రాణేశ్వరీ !

అదితి:—చిత్తము మహాత్మా ! అటులైన మాకెద్దియైన తెరవు దెల్పుము మేమట్లొనర్చెదము.

కస్య—(తనలో నాలోచించుకొని ప్రకాశముగా) ప్రాణనాయకీ ! యేనిపుడు జ్ఞానదృష్టిజూచి భావికార్యంబులు విచారించితి కావున కాలోచితంబుగా గర్తవ్యంబు దెలిపెద దూరదృష్టి దూరశ్రవణంబు లవలంబించి వినుము.—

అదితి.—మనోహరా! మహాప్రసాదము. అట్లు శెలవొసంగుడు.—

మ॥ భగవంతున్ బరమున్ జనార్దను గృపాపారీణుసర్వాత్మకున్
జగదీశున్ హరిసేవసేయు మతడున్ సారస్యమున్ జెందినీ
కగునిష్టార్థములెల్ల నిచ్చు నిఖిలార్థావాప్తి చేకూరెడున్
భగవత్సేవల బొందరాదె బహుసౌభాగ్యంబులన్ బ్రేయసీ!
యిందువదనా! సర్వజగత్పతియగు నా శ్రీయఃపతి నారాధించి
నిఖిల సౌఖ్యముల నొందనచ్చును గదా!

(ఆమాటవిని సంతోషసంభ్రమంబులతో)

అదితి—(అంజలిపట్టి) ప్రాణనాథా!

క॥ నారాయణు బరమేశ్వరు
నేరీతిదలంతు మంత్రమెయ్యది విహితా
చారంబులేప్రకారము
లారాధనకాల మెద్ది యానతి యీవే

ఆయా విధానంబంతయుఁ గరుణించి బోధింపుము.

కశ్య—అటులనా ప్రాణనాయకీ! నీ కుపయోగనవ్రతంబు నుపదేశించి తన్మంత్రంబును తద్విధానంబును తత్తదుచిత దేశకాల నియమంబులును తదుపవాస భోజన ప్రకారంబులును నెఱంగించెదను నీ వట్లాచరించుచు నాహరి నారాధించి వ్రతంబుగావించి నియతాహారవై యున్నయెడల!

గీ. వరచతుర్బాహుడును పీతవాసుడమల
శంఖచక్రగదా ఖడ్గ శార్ఙ్గపాణి
సర్వశుభదాయకుండు శ్రీనాయకుండు
పుండరీకాక్షుడపుడు నీ మ్రోలనిలచు.

గీ. ఆమహాత్ముని దర్శించి నీమమలర
వినతులొనరించి సంగతి విన్నవింపు
మాదయామయుడదివిని యాదరించి
నీ మనోరథ మొనగూర్చు నిక్కముగను.

అదితి—చిత్తము. మహాభాగ్యము ప్రాణవల్లభా! నీవట్లనుగ్రహింపుము.

కశ్య—అట్లయిన నావ్రతవిధానంబంతయు సావకాశంబుగా నీకు వివరించెదగాన విజన స్థలంబునకు బోవుదము రమ్ము."

(అనవిని అదితి తన పరిచారికం దోడుకొని భర్తతో నరుగుచున్నది)

(అంతలో నదితి పరిచారికయొకతె ప్రవేశించి)

కావేరి-(తనలో) అయ్యో నానెచ్చెలి దానెచ్చటనూ గానరాకున్నదే! అమ్మగారు శెలవిచ్చుపనులు వేగముగా నెరవేర్పవలసి యున్నది. (అని యిటునటు జూచి వెతుకుచు)

(యెదురుగా వచ్చుచుండెడు చెలికత్తెంగాంచి)

కస్తూరీ! యిదిగో నీవీదారికే వచ్చితివి. యెచ్చటకు వెళ్ళియుంటివే. యింతవరకు నీకొరకే యెదురు జూచుచుంటిని.

కస్తూరి—అలాగునా కావేరీ! నెచ్చెలీ! యిదుగో నేనును రానేవచ్చితిని నాపని యేమున్నదో చెప్పుము.

కావేరి—మరేమీలేదు మందేవితన భర్తగారివలన పయోభక్షణంబను వ్రత ముపదేశమొంది నియతాహారమై, హరి నారాధింప నున్నది.

కస్తూరి—అటులనా ప్రియసఖీ! ఆమె సేయబూనిన వ్రతమేరీతిది!

కావేరి—ఆవ్రతమందామె పండ్రెండు రోజులవఱకునూ పయోభక్షణంబు జేయుచు దివిజగంగాజలంబుల స్నానపానంబులు గావించుచు నేకాగ్రచిత్తయై హరి నారాధించుచుండవలయునట.

కస్తూరి—అట్లైన మనమిపుడేమి చేయవలసియున్నది.

కావేరి—ఆమెకు స్నానపానార్థంబులుగా నాకాశగంగోదకము దెచ్చుటకు నన్నును, నందనవనంబునుండి దేవతార్చనకు మందారాది సుమంబులు దెచ్చుటకునిన్నును వెళ్ళుడని శెలవిచ్చియున్నారు. కాబట్టి నేనాజలంబులు గొని వచ్చెదను నీవేగి వేగముగా నా, కుసుమంబులను దోడితెమ్ము.

(అని యిర్వురును వెళ్లుచున్నారు)

(కస్యపుడు—వ్రతవిధానంబు దెలిపి మంత్రోపదేశంబు
గావించి పిమ్మట తనసతితో, ప్రవేశించి)

కస్య—ప్రేయసీ! నాచెప్పిన విధానంబంతయును యాదిలోనున్నదా!

అదితి—చిత్తము !

కస్య—నిరాహారవై మంత్రంబు స్మరించుచుండవలయును సుమా!

అదితి—చిత్తము మహాత్మా !

కస్య—వ్రత సాంగం బగునంతవరకు మిగుల నియమంబులతో జపత పంబులు జరుపవలయును సుమీ!

అదితి—చిత్తమట్లనే కావించెదను!

కస్య—అదుగో నీనెచ్చెలులును వచ్చుచునే యుండిరి. యిక నేను స్నానసంధ్యాది కాలార్హవిధులు దీర్చుకొని వచ్చెదను (అని వెళ్లుచున్నాడు)

(అపుడు అదితి పరిచారిక లిర్వురును ప్రవేశింతురు)

అదితి—కావేరీ! తులశీమూలమ్మున గోమయంబున నలికి ముగ్గులుంచితిరా !

కావేరి—చిత్తము మేమింతకుమున్నె. బెక్కురీతుల నక్కడ జక్కగా నలంకరించితిమి.

అదితి—కావేరీ! గంగాజలంబులు దీసుకొని వచ్చితివే !

కావేరి—అజ్ఞాప్రకారము పరిశుద్ధంబులగు దివిజ గంగాజలంబులు కనక కలశంబులతో గొని వచ్చితిని.

అదితి—అట్లయిన కలశంబులో దులశీమూలంబున నుంచుము.

కావేరి—(అట్లుంచుచున్నది)

అదితి—కస్తూరీ! మందార పారిజాతాది కుసుమంబులు గొనివచ్చితివే!

కస్తూరి—చిత్త మాజ్ఞానుసారముగా మందారాది సుమంబులు గుంద నపు బళ్ళెరంబులతో గొని వచ్చితిని.

అదితి—అట్లయిన నీవుగూడ వానినచ్చటనే యుంచుము. (అదితి అట్లుంచును) కావేరీ! వ్రతోచితంబులగు నెల్ల పరికరంబులు దెచ్చి యచ్చట నుంచితిరా!

కావేరి—చిత్తము మేమిదివరకే యుంచి యుంటిమి !

అదితి—అట్లయిన మీ యిరువురును నిక యిళ్ళకు వెళ్ళవచ్చును.

కావేరి—చిత్తము చిత్తము (అని వెళ్ళుచున్నారు)

అదితి—(చిత్రాసనంబున గూర్చుని వార్చి శుచియై దేశకాలాది పరిగణనంబు జేసికొని తులసీమూలంబున పుష్పులతో బూజించుచు శౌరి నారాధించి ధ్యానించుచున్నది.

క. హరివాసు దేవశౌరీ
పరమాత్మము రారి భక్త భావుక కారీ
శరణాగత జనవత్సల
కరుణాకర మమ్ముఁబ్రోవ గదరనగధరా.

(అని పలికి కృతాంజలియై ధ్యానించు నంతలో) శ్రీహరి ప్రత్యక్ష మగుచున్నాడు)

అదితి—భయసంభ్రమములతో లేచి నిలచి (ఆనందాశ్రు బిందువులు రమందు జిందుచుండ)

సీ. శంఖచక్ర గదాది సహిత చతుర్బాహ
కాలాంబుద సమాననీల దేహ
మహిత సన్మునిలోక మానసాంబుజవాస
సిద్ధసౌవర్ణ కౌశేయవాస
సురసిద్ధసాధ్య కిన్నరసన్నుత చరిత్ర
రాజితోత్ఫుల్ల నీరేజనేత్ర
హాటకాంగద రత్న హారాదిసు విభూష
మంగళకరవాక్య మంజుఘోష.

గీ. దీనజనపోష విలసదనూనవేష
సమదదానవసంశోష సత్యభాష
నిరతసంభృత సంతోష నిర్విశేష
మమ్ము గరుణింపుమీశ! రమాహృదీశ.

మత్తకోకిల.

శ్రీవరా ! నినునమ్మి నెమ్మది సేవసల్పెడు వారికిన్
భావనల్ ఫలియింపజేయుచు భావుకంబు లొసంగవే
వేవిధంబుల నిన్నుగొల్చెద వేవరాల నొసంగుమో !
పావనాత్మక లోకనాయక భక్తభావుకదాయకా !

(వనమయూరవృత్తము) యీ సమయమందెమము నేలవలె దేవా
అసురుల బన్నముల కడ్డపడరావా
అసుర మదోద్ధతుల నాపగనె లేవా
వాసవుని గాసినెడబాపవె సుహోవా

లయవిభాతి.

సేవకజనావళికిభావుకములేమెడల ♦ నీవయిడిబోర్చెదవుగావెనతజీవా !
దేవతుల గావనిపుడీవసుమతీసలిని ♦ నీ విలసిత్రోద్భవముగావలెనుదేవా
యేవరుసతోడదనుజావళినడంచెదవొనీవమదినెంచుమిక భావియుతభావా
వేవరమొసంగుమనివేవిధము లన్మనవు♦లీవరుసదెల్పుననుగావురిపుదావా

ద్విపద.

విశ్వనాథాచ్యుత విమలాభిధేయ ♦ విశ్వోద్భవస్థితి విలయప్రధేయ
జగతీ స్వరూపసంజనిత కలాప ♦ విగత దురాలాప వినిహతపాప
యాపన్న పరిపాల నాంచితానంద ♦ శ్రీపతిపరమాత్మ చిన్మయానంద
యజ్ఞేశుడవు నీవయజ్ఞస్వరూప ♦ యజ్ఞకర్తవు నీవ యజ్ఞ సత్ఫలద
నినుగొల్చువారికి నిక్కంబుగాను ♦ ఘనతర వైదిక జ్ఞానంబు గలుగు
సర్వ వైరులగెల్చు సంపదలొదవు ♦ సర్వేశ్వరా వేదసార మహాత్మా !
నతజనమందార నగరాజ ధీర ♦ భక్తప్రసాద పావన తీర్థపాద
సతత సజ్జనపక్ష సరసీరుహాక్ష ♦ గతినీవె సురరక్ష ఖలవైరి శిక్షా !

ఆ॥ వె॥ అసురవరులు సురల నదరించి బెదరించి
నాకమేలుచున్న నాటనుండి
కన్నకడుపుగాన గంట కూడుకురాదు
కడుపు సొక్కుమాన్పి కావవయ్య !

శ్రీహరి—(మందహాసము చేయుచు) దేవమాతా ! ధీసమేతా నీవిటు వినుము ఆమ్రిక్కడి రక్కసులు మిమ్ము జిక్కుపరచి పెక్కు యిక్కట్ల పాలుగావించుట నా పత్రికలను మెరుగుచునే యున్నది. నీవికవేర వాక్రువ్వనక్కరలేదు.

శా. నీ కోడండ్రును నీకుమారవరులున్ నీనాథుడున్ నీవు న
స్తోకంబొప్ప సతుల్ బతుల్ మిగులసంతోషింప రాత్రించరుల్
శోకింపన్ భవదీయగర్భమున దేజోమూర్తిగా బుట్టెదన్.
నాకున్ వేడుకగల్గె; నీసుతుడనై వర్తించి నర్తింపగాన్.

సకలగుణావలంబా ! దివిజాంబా ! అదియునుంగాక వినుము.

మ. బలిమిన్ దైత్యుల జంపరాదు వినయోపాయంబులన్ గాని సం
చలనం బొందకు నేను నీ నియతికిన్ సద్భక్తికిన్ మెచ్చితిన్
బలివిద్వేషుడు నానిలింపగణమున్ బౌలోమియున్ మెచ్చ దై
త్యుల రాజ్యంబు హరింతు నింద్రునకు నిత్తున్ దుఃఖమింకేటికిన్.

లయవిభాతి॥ మానిని త్వదీయఘన మానసము మెరుంగుదును
మానుగ సురేంద్రు సురధాని మేలెంతుక్
దీనుడగు నీదు వరసూనునకు రాజ్యమును
మానకనుగూర్తు పనిబూని యేలింతున్.
దానవులనేలు బలిదానవుని జేరి యిల
దానమును గోరియల వాని డిలింతున్.
దీనతను మానుమిక న్యూనముగ నాపలుకు
లానుమిది నీమది నిగ్లాని దూలింతున్.

దేవమాతా ! నే నాడు నుడువులు నిక్కంబులని నీనెమ్మనమ్మున నమ్ముకొనుము.

మత్తకోకిల. నీవు నెమ్మదిమీరగూరిమి నీమనోహరు గూడుచో
భావమందున నాదురూపము భాసురంబుగ నిల్పుమీ
నే విలాసముతోడ నిమ్మెడ నీదుగర్భము జొచ్చియే
నావలన్ దగు నీకు బుత్రుడనై జనించెద నిద్ధరన్.

ఓ, సుగుణ సంతానవల్లీ ! సురలతల్లీ ! యిదిమొదలు నీమనోవల్ల భండగు గస్యపు నాశ్రియింపుము. మీకడుపున పొట్టి వడుగునై పుట్టి మీరు దలపెట్టిన కార్యంబు పట్టుబట్టి తుదముట్టించెదను (అని యెప్పజెప్పి యాహరి వెళ్లుచున్నాడు)

(అంతలో కస్యపబ్రహ్మ ప్రవేశించి ముదితయగు నదితింజూచి)

కస్య—(ముదముతో)

కం. సతి నేనటు దెల్పిన స
ద్వ్రతమొనరించితివె భక్తవత్సలుడగు శ్రీ
పతి ముదితుడగుచు వచ్చెనె
వితతంబగు వరమొసంగి వెడలెనె సుదతీ !
తెలియబలుకుము కలికీ ! చిలుకల కొలికీ ! !

అదితి—(ఆనందపరవశత్వము నభినయించుచు గొంతవడికి సవినయంబుగా) ఆహా ! ప్రాణనాథా ! పరమ బోధాత్ములగు మీకు విశదంబుగాని దేమున్నది. అయిన నన్నడిగితిరిగాన విన్నవించెదను మీ యుపదేశ క్రమంబుననే నాహరి నారాధించి తత్ప్రపాదంబుగోరి ధ్యానించుచు వానిసందర్శనంబున కెదురు జూచుచుంటి నంత మన భాగ్యవశంబునంజేసి

సీ. మేఘకాంతినడంచు మేనమించును మించు
హాటకమయ శాటి నీటువాడు
కోటి సూర్యప్రభన్ దీటు సేయుచునుండు
విమల కౌస్తుభదీప్తి వెలయువాడు
భర్మనిర్మితమైన భాసురమణి మౌళి
గరిమతో బగగెడు శిరమువాడు
కాంచ నాంచితములై గడనగాంచిన బాహు
పురులు భుజంబుల బొల్చువాడు.

గీ. శంఖచక్ర గదాఖడ్గ శార్ఙ్గ సహిత
సురుచిరాంక చతుర్బాహు శోభవాడు

అక్షయ కటాక్షవీక్షల నలరువాఁడు
సారసాక్షుఁడు మ్రోల సాక్షాత్కరించె.

నేనాపరమపురుషునకు నమస్కరించి భావించి సేవించి మన బన్నంబులన్నియు విన్నవించితిని. అదివిని మహానుభావుఁడగు నావాసుదేవుఁడు నన్ను మన్నించి మీకు పట్టినై పుట్టి మీ యాపదలు బాపి వైరుల యోపుమాపి మహేంద్రునిచే మరల నమరావతిని నేలింతు పాలింతునని వరమొసంగి వెళ్ళినాఁడు మహాత్మా !

కస్య—(మందహాసముచేయుచు) ఆహా మన పుణ్యమేమని వినుతింతును మేలు మేలు ! కోమలీ ! నీభక్తి ప్రపత్తులకును శక్తియుక్తులకును మెచ్చి దానిటు వరమిచ్చి వెళ్ళినాఁడా అనేక క్రతువ్రతంబులొనరించి తపంబులాచరించు మహామునులకైన గానరాని మహానుభావుఁడు నేఁడు నీపతి దేవతాత్వమునకు మెచ్చియే కదా ! సాక్షాత్కరించి వరమిచ్చి వెళ్ళినాఁడు. ఆహా మనభాగ్యమెంతని వచింతును రమణీ శిరోమణీ !

అదితి—ప్రాణనాథా ! అదియంతయు మీతపఃప్రభావమే కదా! మీరట్లనుగ్రహించి యుపదేశించిన మంత్ర మహిమయు వ్రత విశేషము మనకిట్టి మేలు గలిగించినవి.

కస్య—ప్రాణనాయకీ ! నిక్కమే వక్కాణించితి వది సరియే ! ఆమహానుభావుఁడు నాడితప్పనివాఁడుగావున భావికాలంబున నట్టి భావుకంబులా పరమపురుషుని వలన బడయుచుందుము అందుకు సందేహము నొందవలదు.

గీ. స్నానసంధ్యాగ్ని కార్యముల్ జపతపంబు
లలరజేయుచు నాహరి గొలుచుచుండు
నతిథి పూజాదులొనరించు నమితభక్తి
హరిని భావించి సేవించు మబలనన్ను.

అట్లయినచో మన మనోరథంబులు శీఘ్రకాలమున సఫలంబులయి వెలయును.

అదితి—చిత్రము ప్రాణనాయకా ! ఆపరమ పురుషుండుగూడ తాన ట్లనే శెలవిచ్చియున్నాడు గావుననే నావాసుదేవుని భావించు చునే మిమ్ము సేవించుచుండెదను.

కన్య—అట్లయినసరే ! మనమిపుడు గృహంబునకుబోయి కాలార్హ విధులు దీర్చుకొనివత్తుము రమ్మా ! కొమ్మ !

(అని యిరువురును వెళ్లుచున్నారు)

---

ద్వితీయరంగము.

(కస్తూరి_కావేరి_యను నదితి పరిచారికలిర్వురును ప్రవేశింతురు)

కస్తూరి—ఇదిగో నానెచ్చెలీ ! కావేరీ ! నీవెచ్చటకేగెదవే !

కావేరి—ఇదిగో నీవును యిచ్చటకే వచ్చితివి ! ప్రియసఖి ! కొంచె ము తెరపిచేసుకొని నేనిపుడే వేల్పుటమ్మగారి వద్దనుండివచ్చితిని.

కస్తూరి—ఔనే కావేరీ ! నిన్ను కొన్నిమాటలడిగి ! మనమొకసారి ముచ్చటించు కొందామనుకొంటిని. నీకెక్కడనూ అట్టి అవకాశ మే లేకున్నదిగదా !

కావేరి—ఔనే నెచ్చెలీ ! మన వేల్పుటమ్మగారు నీరు మోచికొన్నది మొదలుసన్నొకసారియైననామె యేమరకున్నదినేనేమియందును.

కస్తూరి—అవును మాటనిజమే ! నెలదప్పినది మొదలు నేటివరకు ఆమె కు నీయుపచారమే యెక్కువగానున్నది. ఆమె కోరిన కోర్కె లొనగూర్చు నేర్పును యోర్పును గలదానవు గావున నామె నీతోడనే బొద్దుబుచ్చుకొను చున్నది.

కావేరి—నిజమే నాయెడలనంత వింతప్రియము గలిగి పరిచర్య సేయిం చుకొనుట చేతనే నాకొక నిముసమైన నూపిరి యిచ్చుకొన దెరపిలేకున్నది.

కస్తూరి—నిజమేకాని మ్ము దానికేమిగాని ఆపరమపురుషుడు దానిచ్చిన వరము దప్పక నామెకడుపుజొచ్చి యున్నవాడు గాబోలును నేను నెచ్చెలీ !

కావేరి—అందుకు సందేహ మేమున్నదే! అరవూరమణుడు ఆమె గర్భము నొందియున్నవాడని వేరే వచింపనేలా! చూచువారల కెల్ల నామెమోము చెలువమే జెప్పుచున్నది సుమా!

కస్తూరి—అవునౌనామె యందాచిన్నె లెన్నెన్నియో వన్నెమీరికాన్పించుచునే యున్నవి. మణిదర్పణంబునొందురవి ప్రతిబింబంబువలె నాచతుర్భుజుండామె గర్భంబునం బ్రవేశించి భాసిల్లుచున్నవాడుగాబోలు నెచ్చెలీ!

కావేరి—కమలాకరసలిలంబుజొచ్చియున్న ప్రతిబింబ చంద్రమండలంబుకైవడి నామెకడుపునంబడి హరి తేజరిల్లుచున్నవాడు గనుకనే ఆమెమోమునకట్టి శోభావిశేషంబు గలిగి నెలయుచున్నది.

కస్తూరి—నిజము నిజము తపఃప్రభావసంపన్నుండగు కశ్యపుని తేజోబల విశేషముల నలముకొని యా జగదీశ్వరుడు ఆమె గర్భమునం బ్రవేశించియే యున్నవాడు అందుకు సందేహములేదు.

కావేరి—గీ. మహితశ్రమైతగు నామేఘమండలమున
పిహితమగు చండభానుని బింబమట్లు
విహిత దీప్తాంగములుగల విశ్వగర్భు
డదితి గర్భమునను గ్రీడలాడుచుండె!

కస్తూరి—కాబట్టియే యా వేల్పులతల్లి సఫలయగు కల్పవల్లివలె దానంత వింతచెలువు గలిగి విలసిల్లుచున్నది.

కావేరి—సర్వసామాన్యముగా యువతులు గర్భవతులగునపు డందము వహించి యెల్లవారికి జూడవేడుక గలిగించుచుందురు. అందుపయిని యాకందర్పజనకుని కడుపున వహించియున్న యాకుందరదన చక్కందనమును గనుగొన వేయికనులు గావలెనుగదా?

కస్తూరి—ఆక్కా నిక్కమే వక్కాణించితివి ఆమె చక్కదనమును మనమెక్కడ లెక్కజేయగలుగుదుము కాని నీవెక్కడికో తొందరగా నేగుచున్నదానివలె గానబడుచున్నావు,

కావేరి__అవును నామాటనిజమే. ఆమె కొనెలకొనెల పండుబడిన కొలది సౌఖ్యమును పోలుచు నిపుడు మిగుల నొగిలియున్నది! నీరాడ పొద్దులుగూడ సమకూడియున్నవి. అందుకై మంత్రసానిం దోడితేబోవుచుంటిని.

కస్తూరి__అలాగునా మేలుమాటజెప్పితివి సుమీ! అట్లయినచో మన కోరికలెల్ల వేగముగా నెరవేరుచున్నవి.

కావేరి__అదిసరియే కాని పరమేశ్వరుడామె గర్భస్థుడై యున్నవాడని విని చతుర్ముఖాదులందఱును వచ్చి వేగముగా నవతరించుమని ఆహరిని బ్రార్థించుచున్నారు. హరి యవతరించుట కిదియే తరుణము నేనును యిప్పుడే వచ్చెదను. యింతలో నీవేగి యామె వద్దనే నివసించియుండుము (అని యిర్వురు వెళ్లుదురు)

---

తృ తీ య రం గ ము.

(గర్భవతియగు నదితియును కస్యపుడును వినుతించుచున్న చతుర్ముఖాదులును ప్రవేశించుచున్నారు) హరినుద్దేశించి)

చతురాననుడు__(అదితికి బ్రదక్షిణ మొనర్చుచు)

దోధకవృత్తము. సర్వజగత్పరిపాలన దక్షం ♦ గర్వితదానవ ఖండనదీక్షం
నిర్విషయీకృత సర్వవిపక్షం ♦ శర్వసుశంకలయామి సుదీక్షం

దోధకవృత్తము. దీనజనావన పాలనలోలం ♦ దానవలోక విదారణఖేలం
మానితగాన రసాదరలీలం ♦ జ్ఞానమయంకల యామి సుశీలం

నిర్భర విశ్వగర్భ మదితి గర్భస్థిత మర్భకంత్వామహం భజామి॥

కవిరాజవిరాజితము.

సరసిజలోచన పాపవిమోచన ♦ సాధుజనావన చక్రధరా
సరసగుణాకర వైరివిభీకర ♦ సారగణాదర శంఖకరా
కరిపరిపాలక భవ్యసుశీలక ♦ కాంచనచేలకగానవరా
నిరతమునీపద నీరజముల్ గొని ♦ నెమ్మదిగొల్తుము నీతిధరా!

తరలం. విదిత సర్వ జగత్ప్రవృత్తివి ♦ విశ్వకల్పన కారణా
ముదలొసర్వ సుపర్వమంగళ ♦ మూలహేతు విదారణా

సదమలాంతర యోగధారణ ♦ సాంఖేదనివారణా
అదితి గర్భమునుండి రమ్మవు ♦ డార్యకార్య విహారణా !

వేల్పుటమ్మయగు నీయమ్మగర్భంబునుండి వామనుండవై వెడలి రమ్ము మాకు శుభమ్ములిమ్ము ! తండ్రి ! కాందిశీక బృందార కబృందంబు నానందింపజేసి యేలుకొనుము. (కస్యపుంజూచి) ఆహా నీవుగూడ వేడ్కమీర వేడుకొనుము.

కస్య—(కరంబులు మోడ్చి)

అశ్వధాటివృత్తం.

శరణాగతార్తి గణ భరణా భవాంబునిధి తరణా కృపావితరణా
తరుణారుణోల్ల సత్కిరణా మహోజ్జ్వలత్కరుణా సరోజ చరణా
కరుణా రసాకలిత వరుణాలయ త్రిగుణ వరణా శుభావ తరణా
పరిణామమాణవ విహరణా మురారి మదహరణా నయానుసరణా.

లయగ్రాహి.

శ్రీల సురలోకపరిపాలనము సేయ పరిశీలనమొనర్పుగుణజాలధృత హేలా
వేలుపులకెల్ల బలుమేళలిడి బోవనిదెవేళయని మ్రొక్కెదము చాల నతిలోలా
జాలిగొనియున్న శచినేలుటకు నీవగతి జాలమికనేల వరశీల శుభలీలా !
కాలగతిదూలి బలుగాసిబడితేలిశుభలీలగొనమంటిమికృపాలలితమూలా.

నిత్యకళ్యాణ సంధాయకా ! లక్ష్మీనాయకా ! నాప్రాణనాయకి యగు నదితి గర్భంబునుండి వెడలిరమ్ము! శుభములిమ్ము మము గన్నతండ్రీ పరమేశ్వరా ! (అని మహేంద్రుంజూచి) కుమారా ! నీవుగూడ హరికి విన్నవింపుము.

ఇంద్రుడు— కవిరాజవిరాజితము.

సిరులనొసంగుము శ్రీరమణామము ♦ చేకొని బ్రోవుము చారగుణా
మరిమరి వేడెద చక్రధరానను ♦ మాన్యుని సేయుము శత్రుహరా,
నిరుపమ రూపకలాలలితారమ ♦ ణీ యకలాపకలాకలితా
మొరవినిరార ప్రమోదకరావరి ♦ పూర్ణకృపాకర దృక్ప్రకరా.

బలి దానవునిచే భంగపడియున్న మాబన్నంబులన్నియుం బాపి నన్ను మన్నించి మరల విభవసంపన్నుంజేయు మాపన్నరక్షకా దనుజ శిక్షకా (అని వీతిహోత్రుంజూచి) వైశ్వానరా ! నీవుగూడ హరిని వేడుకొనుము ? (అంతట)

వీతిహోత్రుఁడు—"భక్తియుక్తముగా) చంద్రవర్మవృత్తము.

1 నిన్ను నమ్మితిని నీరజనయనా ʃ కన్నతండ్రిని గావుముకరుణా
సన్నుతించుటకుజాలముపరమా ʃ జెన్నుమీరగను క్షేమములిడుమా
2 విశ్వరూపజని వేగమునొనవే ʃ విశ్వమూలమును వేడుకగనవే
విశ్వనాథరిపు పీటకిజనవే ʃ విశ్వరక్షసిరి వేల్పులకిడవే.

గీ. అదితి గర్భమునుండి నీవవతరించి
ముదితులను జేయుమియ్యెడ ముఖ్యసురల
విదితమై యున్న దేగదా ! విశ్వవార్త
ఘనతరామర్త్య గణకార్య కరణధుర్యా !

(అనియమునింజూచి)దండధరా ! నీవుగూడవాసుదేవునిబ్రార్థింపుము.

యముడు— మయూరవృత్తము.

సురమృత్యుండౌబలి దైత్యుండా ʃ శోభనరాజ్యంబును చేకొంటన్
సురసేవ్యుండున్ బుధభావ్యుండున్ ʃ సుస్థిరభవ్యుండతి దివ్యుండున్
గిరిధైర్యుండున్ గుణధుర్యుండున్ ʃ కీర్తిత చర్యుండధి శౌర్యుండున్
వరగాంభీర్యుం డధికార్యుండౌ ʃ వాసవుడాధిన్ గొనెదీనుండై.

మత్తకోకిల.

కావునన్ గృపగావుమియ్యెడ ♦ గాసినొందు మహేంద్రునిన్
వాసుదేవ దయానిధే యిక ♦ భావుకంబు లొసంగుమీ
తావునన్ జనియించి యాబలి ♦ దైత్యువంచన జేసిమా
దేవదేవుని రాజ్యమున్ గొని ♦ తెమ్మురమ్మ శుభమ్ముగాన్

మహాత్మా విపన్నుండగు నీమహేంద్రుని మరల స్వారాజ్య విభవ సంపన్నుంగావింపుము. మా విన్నపంబులు సంభావింపుము. (అని వరుణదేవుంజూచి) పాశాయుధా ! నీవుగూడ శ్రీహరికి విన్నవింపుము)

వరుణుడు—(భక్తియుక్తముగా) మత్తకోకిల వృత్తములు.

1 పూర్ణచంద్రనిభాననా మము బ్రోవరావె జగత్పతీ
స్వర్ణభాసురచేల దిక్పరిపాల పాలనధీరతీ
దుర్నయామరవైరి కల్పిత దుఃఖముల్ దొలగింపగా
నిర్నయాంతర వృత్తిమైతగు నీవదిక్కు దయామతీ.

2 వర్ణనీయ శుభాకృతీవర భారతీ సుగుణాదృతీ
తూర్ణముగ జనియింపు మీపరితోష మొప్పరమా పతీ
పూర్ణమౌ విపదంబురాశిని బూని దాటగ సేయగాన్
కర్ణధారుడవైనవాడవు గావె దైవతపాళికిన్.

మామొఱ్ఱలాలించి లాలించి పాలించుము. మమ్మేలుమేలెంచుము.
(అనికుబేరుంజూచి) త్ర్యంబకసఖా ! నీవుగూడశౌరికివిన్నవింపుము.

కుబేరుడు—(వినివినయ పూర్వకముగా) తురంగప్రయాతము.

పురాణపూరుషా విశేషభుక్తి ముక్తిదాయకా
సరోజనాభదివ్య శోభ చక్రి ముఖ్య సాయకా
పరాత్పరారమావరా, సుపర్వ రాజరక్షకా
నిరామయాదయాను యాత్మనిత్య దైత్యశిక్షకా.

మత్తకోకిల.

వాసుదేవ ప్రచండ శాసన ♦ పాపరూప వినాశనా
భాసురాంగ సరోజలోచన ♦ భక్తదైన్య విమోచనా
వాసవాది సురాళినేలవె ♦ వాసిమీఱగ కేశవా
దాస జనులకు నీవదిక్కగ ♦ దాగదాధర మాధవా.

మురాసురాంతకా ! మా వేల్పుటమ్మ కడుపునిండి తడవుసేయక
వెడలిరమ్ము మాకభయమిమ్ము (అని యీశానుంజూచి) మహే
శ్వరా ! నీవుగూడ ముకుందుని వినుతించి విన్నవింపుము.

ఈశానుడు—(కృతాంజలియై) అశ్వధాటీవృత్తము.

దేవాదయాకలిత భావాసురారి వనదావా మహానుభావా
వేవే మహావిభవ మీవే సురాళికి శుభావాప్తి వాసుదేవా

యీవేళ నిన్నుగని సేవింపగానెంచి భావించు మమ్ము బ్రోవా
రావే సమస్త జగదావాస పుణ్యములతో వాభవాబ్ధినావా.
వీరాసుమేరు గిరిధీరా ! నిరస్తరిపువారా ! కృపాబ్ధిపూరా
శూరాదినేంద్రరుచిసారా ! సుచక్రపటుధారా విలుప్తఘోరా
రారా ప్రశస్త మణిహారాది భూషిత శరీరాల సద్విహారా
ధారాధరాంచిత శరీరా సురేంద్రునకు సారాధికార మీరా.
యిడుములబడి కడు బడలియున్న వేల్పుదొరను మరల సిరుల నొం
దింపుము కరివేల్పా !

(అని వేడుకొని చతుర్ముఖాదులందఱును నిజనివాసంబులకు వెళ్లుచున్నారు)

(పరిచారికలం దోడ్కొని యదితియు నంతఃపురమునకు వెళ్లుచున్నది)

(అంతట శిష్యులతో బృహస్పతి ప్రవేశించుచున్నాడు)

కస్యపుడు—(గురుని సముచితాసనంబునగూర్చుండబెట్టి) వినయముతో)
క. ఆర్యా ! సర్వసుపర్వాచార్యా గుణధుర్యవిబుధ సన్నుతచర్యా !
కార్యావసర మెఱింగియె పర్యుత్సుకతన్ వహించివచ్చితిరిటకున్.
మీరాక మాకిపుడు మేలుగలుగ సేయునై యున్నదిగదా సురాచార్యా!

బృహస్పతి—(సాదరంబుగా) తపఃప్రభావ సంపన్నుండవగు మహాను
భావుడవు నీకన్నియును భావుకంబు లేకలుగుచుండును మహాత్మా !

కస్యపుడు—గురువర్యా ! మాకులగురువులును పెద్దలునైతగు మీ
యాశీర్వచనమే యిట్లు పరిణమించుచుండునుగదా ?

బృహ—సురాసురులకెల్ల దండ్రివైయుండు నీవుగూడ నిట్లాడదగునా
మహాత్మా ! మాయెడల నీకుగల పరమాదరంబు జూపు
టిదియేకదా !

శ్లో. మంత్రే తీర్థే జపేదైవే దేవజ్ఞే భేషజే గురౌ
యాదృశీ భావనాయత్ర సిద్ధిర్భవతి తాదృశీ.

అని యున్నది గావున వారివారి భావనకే యందందునట్టి ఫలము
లిచ్చుచుండును.

కస్య—అది యట్లనే యగునుగాని యిపుడా హరి యవతరించుటకు

తరుణంబై యున్నది. శుభగ్రహాన్వితంబాగు సుముహూర్తం బర
యుచుండుడు గురూత్తమా !

బృహ— యేనిదివరకే పరిశీలించి యుంటిని శుభగ్రహస్థితి వీక్షణాదులు
గలిగి యభిజిత్సంజ్ఞగల యీ లగ్నంబే శుభప్రదముగా నొప్పు
చున్నది యింతకన్న విశేషముహూర్తమేమున్నది. మహానుభావా.

(అంతట తెరలో సురదుంధుభులు మ్రోగును)విరులువానలుగురియును)

(తెరలో ఇట్లని గానముసేయుచున్నారు) సూత్రికాప్రారంభము)

కళ్యాణి— ఆదితాళము.

అవతరించె హరి వామనుడై । అమరలోక రక్షామనుడై ॥అవ॥
దివిజులెల్ల సన్నుతించుచుండగ । నవనిజనులు సంతసిల్లుచుండగ ॥నవ॥
ముదితులగుచు సురలు మ్రొక్కుచుండగ । నదితి కడుపునుండియిపుడు
గడవడి ॥నవ॥
సురదుంధుభులటు మరిమరి మొరయగ । సురతరువులు విరుల వాన
గురియగ ॥నవ॥
లలితశంఖచక్రగదాద్యాయుధముల । నలరుచతుర్భుజములువెలయగ॥నవ॥
కోటిరవి ప్రభవలరెడు రత్నకి । రీటము శిరమున నీటుమీరనిపు ॥డవ॥

(మరల తెరలో)

మ. రవిమధ్యాహ్నమునన్ జరింప గ్రహతారాబద్ధ చంద్రస్థితిన్
శ్రవణ ద్వాదశినాడు శ్రోణనభి జిత్సంజ్ఞాత లగ్నంబునన్
భువనాధీశుడుపుట్టె వామనగతిన్ బుణ్యప్రితో పేతకున్
దివిజాధీశ్వరు మాతకున్ బరమపాతివ్రత్య విఖ్యాతకున్.

శా. చింతంబాసిరి యక్షతార్క్ష్య సుమనః స్సిద్ధోరగా ధీశ్వరుల్
సంతోసించిరి సాధ్యచారణ మునీశబ్రహ్మ విద్యాధరుల్
గ్రాంతింజొందిరి భానుచంద్రములు రంగద్గీత వాద్యంబులన్
గంతుల్ వైచిరి మింటగింపురుషులున్ గంధర్వులున్ గిన్నరుల్.

(అని మరల) (తెరలో)

ఆహా యీ దేవకాంత మహాభాగ్యమెంతని పొగడుదును.

కం. పురుడీబోటికినిందిర ♦ పురుడంబిక గాక యొరులు పురుడేయనుచున్
పురటాలికిదశదినములు ♦ పురుడుప్రవర్తించిరెలమిపుణ్యాపుగరితల్.

కం. అన్నారమ్మని డగ్గరి చన్నుల పాలేరువార సంశ్లేషిణియై
చిన్నారి మొగముని వ్రురుచు గన్నారంజూచె కన్నకడుపైయుంటన్.

ఆహా యిది యెంతవింత అదితిగర్భమునుండి జనించిన చతుర్భుజుండు దానొక నిమేషమాత్రంబున సర్వాభరణ భూషితంబును శంఖ చక్రాద్యాయుధాలంకృతంబును నగు తన దివ్యరూపంబు నుజ్జగించి రూపాంతరంబుగైకొని కపటవటుని చందంబున నుపనయన వయస్కుండై తల్లిముందట సముచితాలాపంబులాడుచు గ్రీడించుచుండెను. యిది యేమిచిత్రము యిదియేమి యబ్బురము యికనేమని వచింతుము. (ఇదియే చూళిక)

(అని వినవచ్చుచున్న పెక్కులగు శుభవాక్కులువిని)

కస్యపుడు—గురువర్యా! శ్రీహరి యవతరించి వామనుడై నటించుచుండెనని వినవచ్చుచున్నది గావున మనమిపుడు అచ్చటికి వెళ్ళి విబుధవరుల రావించి పుత్రోత్సవ ప్రదానంబులు గావించి జాతకర్మ నామకరణాది సంస్కారంబులు సేయించి వత్తము రమ్ము మహాత్మా!

బృహ—మహాభాగ్యము మహానుభావా! మనమట్లనే చేయించి వెంటనే యుపనయనంబుగూడ గావింతము లెమ్మ!

(అని వారందరును వెళ్లుదురు)

తృతీయాంకము సంపూర్ణము.

# మహేంద్రవిజయము.



## చతుర్థాంకము.

### ప్రథమరంగము.

(నారద తుంబురు లిర్వురును ప్రవేశించి హరిని వినుతించి గానంబు సేయుచున్నారు.)

కాఫీరాగము—ఆదితాళము.

నార—శ్రీవర కరివరదా । సదా ॥శ్రీవర॥

పావన గుణగణ । పాతకహరణా । సేవకజీవన । శ్రీసతికమన ॥శ్రీవ॥

1 సేవక జనలోల । గోపాలా ॥సేవ॥

భావుకజాలా । స్వర్ణసుచేలా । పావనశీలా । భాసురలీలా ॥శ్రీవ॥

2 మందరగిరిధారీ శౌరీ ॥మందర॥

సుందరకవివర ।సూక్తిగణాదర । చందనశరశరదిందుయశోభర॥శ్రీ॥

కం. కరిరాజ వరద మాధవ ♦ పరమాత్మముకుంద భక్తభావుక కారీ !
సరసీరుహాక్ష శౌరీ ♦ పరమాదర లీలనేల వలదె మురారీ.

దాసోహం ! హరి ! దాసోహం! పుండరీకాక్షమాం ! రక్షరక్ష కౌస్తుభాలంకృతవక్ష సాధుపక్ష.

తుంబురుడు—

మ. హరినారాయణ వాసుదేవ పరమాత్మా కృష్ణగోవింద శ్రీ
ధరదామోదర పద్మలోచన ముకుందా భక్తసంరక్షణా
వరదా మాధవశౌరి శేషశయనా వైకుంఠ దీనార్తిసం
హరణా కేశవ చక్రహస్త నరసింహా వైన తేయధ్వజా.

దాసోహంతవ దాసోహం ! మాంపాలయ.

(అంతలో నొకకంచుకి ప్రవేశించి)

కంచుకి—ఎవరయ్యా ! స్వామీ మీరలు.

తుంబ—యేమిరా ! వేత్రహస్తా ! నీవెవ్వరి శెలవుప్రకారము వచ్చి మమ్ము అడుగుచుంటివిరా ?

కంచు—కస్యపబ్రహ్మగారి శెలవుప్రకారము వచ్చినానయాస్వామీ !

నార—సరేకాని మీకస్యప బ్రహ్మగారేమి చేయుచున్నారురా ?

కంచు—అదితికడుపున హరి వామనమూర్తియై యవతరించుట కానందించి భూసురోత్తములకు బుత్రోత్సవంబున ధనకనకాదు లిదివరకే యొసంగి నిపుడెందుకేతించిరని వామనునకుకు జాతకర్మ నామకరణాదులు సేయించుట యైనది. అవురు ! ఇపుడు పయనంబుగాంచుటకా బాగుబాగు.

నారదుడు—అట్లాగునా ! మంచిదికానీ ! తుంబుర నారదులు వచ్చి యున్నారని మనవిసేయుము.

కంచు—చిత్తమట్లనే విన్నవింతును. —(అని వెళ్ళుచున్నాడు)

(అంతట తెరలో)

ఆహా యేమిచిత్రముగానున్నదే ! మంత్రమంత్రార్థములు అధిక దైవతంబగు నీవామనునకు

సీ. సవిత సావిత్రిని చక్కగాబోధించె
దగ బృహస్పతి జన్నిదంబొసంగె
గస్యపుడలమౌంజి గోపీనమదితియు
డంబారు కృష్ణాజినంబు ధరణి
గగనాధిదేవత సొగసైన గొడుగును
చంద్రుడు దండమున్ సరపినిడిగి
జలజగర్భుడు గమండలువు నొసంగెను
బ్రకటాక్షమాలిక వాణియొసగె

గీ. అపుడు సప్తర్షులెల్లను హర్ష మొసగ
గుశపవిత్రాదులొసగిరి కుశలముగను
భిక్షగొను పాత్రమొసగెను యక్షరాజు
భిక్షనిడె నన్నపూర్ణ దానక్షయముగ.

కం. శుద్ధబ్రహ్మర్షి సమా ♦ రాద్ధంబైవిహితమంత్రరాజిజదువుచున్.
నిద్ధంబగునవలంబున ♦ వృద్ధాచారమునవటుమ్మ వేల్చెన్ గడిమిన్.

(ఆమాటలువిని తుంబురునితో)

నార—ఆహా ! జాతకర్మనామ కరణాదు లగుటయేకాదు సముచితం బుగా నుపనయనకర్మ కలాపంబంతయుంగూడ మనము రాకుం డనే యపుడే జరిగినటులే వినవచ్చుచున్నది. వింటివాతుంబురుడా!

తుంబు—అవునౌను ! వామనుండన్నిటం గృతకృత్యుండై వెలయుచున్న వాడనే వినవచ్చుచున్నది. మనమును సమయమునకే వచ్చితిమి !

(అంతలో మరల కంచుకి ప్రవేశించి)

కంచుకి—(తుంబుర నారదులంజూచి) యో మహాత్ములారా ! మా యధికారి శెలవైనది వారిసన్నిధికి మీరిక నిరభ్యంతరముగా వెళ్ళవచ్చును.

నార—అట్లయిన సరే మంచిది. "అని" తుంబురుడా ! మనమచ్చటికి వెళ్ళి లోకరక్షామనుండగు వామనునిందర్శించి వత్తమురమ్ము !

(అని యిర్వురును వెళ్ళుచున్నారు).

(అంతట పటాంతరమునందు వామను నుపలాలించును)

అదితి—ఆ. వె. నన్నుగన్నతండ్రి నాపాలిదైవము
నాతపః ఫలంబ నానుపుత్ర !
నాదుచిన్నివడుగ నాకులదీపక
రాగదయ్య భాగ్యరాశివగుచు.

అని చుబుకంబుపుణికి ముద్దుబెట్టుకొని గారవించుచున్నది.

కస్య—(గౌరవాదరంబులతో)

ఆ. వె. మమ్ముగన్నతండ్రి ! మాకులవేలుప
మత్తపఃఫలంబ మత్కుమార
మాదు ముద్దువడుట మా మహాభాగ్యమా
చెంతజేరరమ్ము ! చెలువుగొమ్ము.

(అని చెక్కిలి ముద్దుబెట్టుకొనుచున్నాడు) అంతలో నెదురుగావచ్చు చున్న తుంబుర నారదులంగని)

కశ్య— "ఎదురుగా వెళ్ళి" మహాత్ములారా! మీ రాక మా కమితశుభ పరంపర లిచ్చుచున్నదిగదా?

నార—మీ వధూవరుల తపఃప్రభావము చేతనే! అట్టి శ్రీహరి మీకిట్టి చిట్టిపట్టియై పుట్టి వేడుకగా గ్రీడలాడుచుండెను. మీ దంపతుల మహాభాగ్య మేమనికొనియాడుదును.

తుంబు—యెన్నెన్ని యో క్రతువ్రతాదు లొనరించువారలకైన నందరాని మహానుభావుడు. మీకడుపున గుజ్జురూపమ్మున ముజ్జగంబులు వినుతింప బట్టియైపుట్టి యీ లీల గ్రీడించుచుండెను. మీ సతిపతు లొనరించు ననేక పుణ్యవిశేషముల నేకదా? అట్టి మీ మహిమావిశేష మెంతని వినుతింతును మహాత్మా!

నార—"వామనుం జూచి"

మత్తకోకిల—భాసమానవిలాస నీదగు భవ్యలీలల నెన్నగా
నా సరోజభవాది దేవతలైన జాలరటన్న చో
నే సమర్థుడనే పరాత్పర నేరమొంచక బ్రోవరా!
వాసుదేవ మురాసురాంతక పావనాత్మక వామనా.

వాసవామలగాసి మాన్పుట కవతరించిన మహాత్మా! శీఘ్రముగా కర్తవ్యంబు నాలోచించుము. మా విన్నపంబు లాలించి పాలించుము.

తుంబురుడు—మత్తకోకిల.

జాతవైరము బూని దైవత సాధువంచన సేయగా
నీతిమాలిన దానవాళిని నేర్పుమీర హరింపగా
ఖ్యాతిమీరగ వామనత్వము గాంచిమించిన శ్రీధరా
యీతరిన్ భవదీయదర్శన మిచ్చియేలితి వీశ్వరా.

దానవుల గర్వంబు సర్వంబుగణంచి వేగముగ సుపర్వకార్యంబు నెరవేర్చుము. ఖర్వుండవగు సర్వేశ్వరా!

వామనుడు— "మందహాస మొనర్చుచు" సురమునీంద్రులారా! మీ మనోరథంబులు శీఘ్రకాలములోనె సఫలముగా నొనర్తు. నందుకు సందేహమొందకుడు. [వచ్చెదము స్వామీ.

నార, తుంబు—మహాప్రసాదముస్వామీ! శెలవొసంగుము. మే మే

వామ—వెళ్ళిరండు. పరమభాగవతోత్తములారా!

"తుంబురనారదు లిర్వురు కస్యప బృహస్పతులవద్ద శెలవుగొని వెళ్లుచు"

నార—"గురుశిష్యులం జూచి" ప్రబుద్ధమేధావులారా! యిటురండు "అని పిలిచి" "రహస్యముగా" బలిచక్రవర్తి యిదివరకు తొంభై తొమ్మిది యజ్ఞములు చేసినాడు. యిపుడు నూరవ యజ్ఞము సేయుచున్నాడట. అది సాంగముగాకపూర్వమె మీరీవామనుని నటకు వేగముగా దోట్కొనిపొండు.

ప్రబుద్ధుడు మేధావియు } చిత్తమట్లనే సేయుదుము. "అని తుంబుర నారదులను సాగనంపుచున్నారు.

వామ— "గురుశిష్యులంజూచి"

ఉ. వత్తురె భూసురోత్తములు వారికి దాతలు ప్రీతిమీర దా

మిత్తురె వాంఛితార్థములు నెంతయు సంతసమొప్ప మీరలున్

దెత్తురె బల్ధనాదులను తీరుగ ధారుణిపైసదావదా

న్యోత్తముడైన దాతనిపు డొక్కనిదెల్పుడు బొల్పుమీరగాన్.

ప్రబుద్ధుడు—

మ. కలరే దాతృవరుల్ వెసన్ ధనములున్ గామ్యార్థముల్ గాంచువి

ప్రులు నేతెంతురుగాని యీవినిబలిన్ బోలన్వదాన్యుండు లే

డలఘుండై యొనరించునధ్వరశతంబా భార్గవానుజ్ఞతో

బలివేడంబడయంగవచ్చు బహుసంపల్లాభముల్ వామనా!

మేధావి—కం. బలియెవదాన్యశిరోమణి

వలనుగ నటకేగు విప్రవరులెల్ల సిరుల్.

బలుమరు గొనివచ్చెదరల

బలిమఖవాటికకు జనుము వామన నీవున్.

బలి దానవునికడ కేగిన నీకోరిక నెరవేరును. మహాత్మా!

వామనుడు—"తలిదండ్రులంజూచి"

కం. బలి గ్రతువాటికకును జని

కులుకుచు మత్కాంక్షితంబు గొనివచ్చెదనే

జెలమిగొని శెలవొసంగుడు
పొలుపుగ తలిదండ్రులార పూజితులారా!
"అని నమస్కరించుచున్నాడు" వామనునిచెంత జేర్చుకొని
అదితి గారవించి—కం. కలుశుభము లలరుగావుత
బలిదానవనాధుసవనవాటికి జనిత
త్కలిమిగొని తెమ్ముర మ్మిటు
జెలువలరగ మేరుధీర చిన్నికుమారా!
నీ తలంచిన తలంపు సఫలంబగుగావుత. నేగిరమ్ము కుమారా!
కస్య—"ఆదరించుచు" కం. చెలువలరగ బలి దనుజుడు
సలిపుడు జన్నమున కేగి చతురతతో నీ
తలపు సఫలముగ సిరులను
పొలుపుగ గొనిరమ్ముపొమ్ము ముద్దుకుమారా!
ముద్దుకుమారా! నీమనోరథంబు సిద్ధించుగాక వేగమున నేగిరమ్ము.
వామ—"గురునింజూచి" కృతాంజలియై
అచార్యవర్యా బలి దానవుని క్రతుశాల కేగవచ్చెద నిందరిపద
వింగొనివచ్చెద శెలవొసంగుడు.
బృహ—గీ. నీకుకోరిక నెరవేరు నిక్కముగను
చక్కగా నిష్టు బలిక్రతు శాలకేగి
తోరమగులీల నీకు చాతుర్యమెసగ
బలిని వంచించి సిరులను బడసిరమ్ము.
వామనా!—యిదియే మంచి ముహూర్తము గావున నీవీ శిష్యులతో
గూడి వేడుకగా నేగిరమ్ము. శుభమ్మగుగాక ము పొమ్ము.
"వామనుడు గురుశిష్యులముందు నడచుచుండ వారితో దానును
వెళ్లుచున్నాడు.
కస్య—"గురునింజూచి" గురువర్యా!
కం. ప్రక్షీణుండగు నిందురిని
రక్షింపందలచికాదె రాజీవాక్షుం

డీక్షణమున బలికడకుం
బిక్షుంగావింపనేగె పేదకు సరిగాన్.
ఎంతవింతగానున్నదో చూచితిరా గురువర్యా!

బృహ—కం॥ హరిహరి సిరి యురమునగల
హరి, హరిహయు కొఱకు దనుజు నడుగన్ జనియెన్
బరహితరత మతియుతులగు
దొరలకు నడుగుటయు నొడలి తొడవులు పుడమిన్.

పరహితాచరణతత్పరులు అడిగి తెచ్చినను మెచ్చ వలయుచుం దురు. వారికది గొప్పగనే యొప్పుచుండునది యొక తప్పుగాదు.

అదితికస్యపులారా! మీ కోర్కెలు ఫలించును. యికసుఖంబుం డుడు. యేనును గాలార్ఘ్యవిధులు దీర్చుకొనం బోయివచ్చెదను.

అదితి, కస్య—చిత్తము మహాత్మా వెళ్ళిగండు.

"అని ఇట్లందరును వెళ్ళుచున్నారు."

---

చతుర్థాంకము—ద్వితీయరంగము.

వింధ్యావళీ యుక్తుడగు బలి చక్రవర్తియును ఛండామార్క సహితులగు భార్గవాదులును ప్రవేశించుచున్నారు "త్రేతాగ్నియుక్త హోమగుడంబుగల యజ్ఞశాలను ప్రవేశించుచున్న హోతలతో"

శుక్రాచార్యుడు— "పూర్ణాహుతింగావించి వింధ్యావళీ సమేతుడై కూర్చున్న" (బలిచక్రవర్తింగాంచి) దానవేంద్రా మీపుణ్యావశంబునం జేసి శతాశ్వమేధ సంకల్పంబు జేసినదిమొదలు నేటివరకు నిర్విఘ్నంబుగా తొంబదితొమ్మిది యజ్ఞములును జక్కగా జరిగినవి. యిపుడీ నూరవ యజ్ఞంబునకుగూడ బూర్ణాహుతియైనది. అవభృథస్నానంబుదక్క తక్కిన యాగకర్మకలాపంబంతయు సాకల్యంబు నొందినది. యికముందు సంగతి యున్నది.

బలి—గురువర్యా! మీసామర్థ్య విశేషముచేత నదియంతయూ జక్కగా నెఱవేరినదికాదా! యికతక్కినది మాత్రమేలజరుగకుండును!

మీయనుగ్రహమువలన నదియునూ బాగుగానేజరుగును. "అంతలో నిరువురు భూసురులతో వామనుడు ప్రవేశించుచున్నాడు". "మిగుల నాశ్చర్యముతో వామనునిజూచి స్వస్తిచెప్పుచున్న సభ్యులంజూచి"

ఛందుడు—

శా॥ హరుడో శ్రీరమణీమనోహరుడో ఛండాంశుడో వాణీమనో
హరుడో యాతడు వీతిహోత్రుడో మహా యజ్ఞేశుడో చంద్రుడో
వరతేజంబురు నోజమున్ వెలయగా భాసిల్లు నీధారుణీ
సురు డెవ్వండొకో యిట్లు వచ్చెనహహా శుభ్రప్రభారాశియై
యీ మహామహుండెవ్వాడై యుండునో భూసురేంద్రులారా?

అమర్కుడు—

మ॥ బలిదైత్యుం డొనరించు యాగమునకున్ భావంబు నన్మెచ్చి త
త్ఫలరూపంబుగ యజ్ఞభోక్తయగు నప్పద్మాక్షుడీలీలదా!
నెలమిన్ గైకొని వచ్చెగాక భళిరా యేభూమియుండైన కే
వల భూమీసురు డిట్లు భాసిలునె శోభారూప రేఖామునలన్!

ఆహా ఇట్టిమహామహుని మన మిదివర కెవ్వండైన జూచియుంటిమే విప్రవరులారా? "అపుడు వింధ్యావళియుక్తుడగు బలిచక్రవర్తియు శుక్రాదులు నొక్కుమ్మడిగా! భయసంభ్రమంబులతో జూచుచున్నారు.

వామనుడు—నడుగడలంజూచుచు మురిపెంపునడకల నడుచుచు సభ్యుల నాలోకించి

సీ. చెవులకు నెంతయు చవులూర సామంబు
లొప్పుగాజెప్పెడు హోతలార
సతతంబు బహువిధ సవనవిధానముల్
జతురతన్ దెల్పెడు సభ్యులార
అనిశంబు మంత్రమంత్రార్థభావంబుల
నరసించిపల్కెడు యాజులార
అలహూమకుండంబు లందు ద్రేతాగ్నుల
వెలయించు యాజకవితతులార

గీ. మంత్రిమంత్రార్థ విధులైన మహితులార
వేదవేదాంగ కలితులౌ విప్రులార
మీ మహిమచేతనె శతాశ్వ మేధములను
బూని యొనరించె బలియెంత పుణ్యతముడొ

మీవంటి మహనీయులయెదుట నశ్వమేధశతం బొనరించు బలిదా నెంత మాన్యుఁడొ యెట్టిధన్యుఁడో కదా భూసురేంద్రులారా! నేను మీతోఁగూడ.

మ. సరిగా వేదము స్వస్తిచెప్పుదును నాసామర్థ్య మేపారవ్యా
కరణాంబెంతయు చర్చసల్పెద సభన్ గాటంబుగా తర్కవా
క్స్ఫురణన్ వాదముసేయుదున్ బుధులు సంశోభిల్ల వేదార్థమున్
గరిమన్ జెప్పెదనిప్డు మీమ్మృదుమనఃకంజాంబు రంజిల్లగన్!

చండామార్కులు— చిత్తము మహాత్మా! మా మహాభాగ్యము మహానుభావా!

వామనుఁడు— సీ. సరళిగా ఘనమైన జటయైన నాతోడ
బెరసిజెప్పెదరె యో విప్రులార
సరసమానలతర్క శాస్త్రంబు నాతోడ
దర్కించెదరె మీరు ధన్యులార
గరిమమీరగను వ్యాకరణంబు నాతోడ
చర్చించెదరె మీరు శాస్త్రులార
సరణిమీరగ ధర్మశాస్త్రంబు నాతోడ
సల్లపించెదరె యో సభ్యులార
గీ. శాంతముగ బూర్వపక్ష సిద్ధాంతములను
మొనసి నాతోడ వాక్యార్థమును వచింత్రొ
సరగ నాతోడ వేదాంతశాస్త్రగోష్ఠి
వెలయ నొనరింతురో తత్త్వవేత్తలారా!

చండుఁడు—భయసంభ్రమాబుల నభినయించుచు
త్రయీమహాత్మకుండగు సాక్షాత్ప్రభాకరుని కరణిఁ బ్రకాశించు

చున్న నీయెదుట శోభావిహీనంబులగు గ్రహతారాగణంబుల
వడువున నీబడలియున్న మేమేమనివచింతుము మహాత్మా!

విదూషకుడు—యెక్కడనూ బ్రాహ్మణుడు లేకుంటే యజ్ఞముసేయించే
వారమే! మనమందరమూ యిటువంటి మహనీయుల యెదుట
నిక నెట్లుశోభిల్లును మనపాండిత్యములు. చండామార్కులారా!
అబ్ధిలంఘనమొనర్చు నాంజనేయునియెదుట కుప్పిగంతులువేయు
టవలె నున్నది.

చండు—అవునవును. విదూషకా! యీమహామహునిచాతుర్య మట్టిదియే.

కం. కొందరితో జర్పించును
కొందఱితో జటలుసెప్పు గోష్ఠింజేయున్
కొందఱితో దర్కించును
కొందఱితో ముచ్చటాడు గొందఱనవ్వున్.

విదూషకుడు—అవునౌనీమహాత్ముడు నావలె నదటి కన్నిరూపులుగా
గాన్పించును.

క. వెడవెడ నడకల నడచుచు
నెడనెడ నడుగిడక నడరి యిలదిగబడగాన్ ·
బుడిబుడి నుడువులు నొడువుచు
జిడిముడి దడబడగవడుగు జేరెన్ రాజున్.

చండుడు—అవునౌ నదినిజమేకాని భిక్షుకుండు రక్షోవల్లభునితో నేమని
ముచ్చటించి పల్కునో మనమది వినుచుందము.

వామనుడు—"బలిచక్రవర్తిం జేరి"

మ. ఇతడాదానవచక్రవర్తి! సురలోకేంద్రాగ్ని కాలాది ది
క్పతిగర్వాపనయ ప్రవర్తిగతలోభస్ఫూర్తి నానామఖ
వ్రతదాన ప్రవణానువర్తి సుమనో రామామనోభేదనో
ద్ధతచండాతపకీర్తి సత్యకరుణా ధర్మోల్లసన్మూర్తిదాన్.

"దంపతులిర్వురను భయభక్తులతో లేచి వామనుని యెదుర
నిలుచుచున్నారు."

వామ—కుశపవిత్రాక్షత సంయుతంబగు తన దక్షిణహస్తంబుసాచి"

ఉ. స్వస్తి జగత్త్రయీభువన శాసనకర్తకు సమాత్రవి
ధ్వస్తనిలిప భర్తకునుదారపదవ్యవహర్తకున్ మునీం
ద్రస్తుతమంగళాధ్వరవితాన విహర్తకు నిర్జరీగళ
న్యస్త సువర్ణసూత్ర పరిహర్తకు దానవలోక భర్తకున్.

త్రిభువనవ్యాప్త కీర్తి ప్రతాపసాంద్రా! నీకు శాశ్వతసుఖంబులగుగాక!

బలి—"అట్లు వల్కుచున్న వామనున కెదురుగా వచ్చినిల్చి

మ. వడుగా యెవ్వరివాడ? వెవ్వడవు సంవాసస్థలం బెయ్యది
య్యెడకున్నీ వరుదెంచుటన్ సఫలమయ్యెన్ వంశమున్ జన్మమున్
గడు ధన్యాత్ముడనైతి నీమఖము యోగ్యంబయ్యె నాకోరికల్
గడతేరెన్ సుహుతంబులయ్యె శిఖులున్ గళ్యాణమికాలమున్.

మహాత్మా మూర్తీభవించిన వేదరాశివలె వెలయుచుండు నీ వె
చ్చటనుండి యిచ్చటికి వచ్చితివి. మహామహుండవగు నీయెదుట
నీభార్గవాదులందఱూ దినకరకిరణతిరోహితంబులగు గ్రహంబులచదం
బున దిరోహితులై తేజరిల్లకుండిరిగదా!

"అని నమస్కరించి మహాత్మా యీపసిండిగద్దియనధివసింపుము!
అని కూర్చుండబెట్టి"

"వింధ్యావళింజూచి" ప్రాణనాయకీ! యీ మహామహుండగు వడు
గుయడుగులు గడిగి, తడిమొత్తి తత్పావన జలంబులు తలధరించి పవి
త్రులమగుదము. కనకకలశంబుతో జలంబులు బోయుము.

వింధ్యావళి—చిత్తము ప్రాణనాయకా "అని కలశంబుతో జలంబు బో
యుచున్నది. వటుని పాదంబులుగడిగి తజ్జలంబులు వధూవరులు
శిరమున జల్లుకొనుచున్నారు.

బలి—మ॥ వరచేలంబులొ సూడిలో ఫలములో వస్త్రంబులో గోవులో
హరులో రత్నములో రథంబులొ విశిష్టార్థంబులో కన్యలో
కరులో కాంచనమో నికేతనములో గ్రామంబులో భూములో
ధరణీఖండమొ గాక నే మడిగెదో ధాత్రీసురేంద్రోత్తమా !

చిన్నివడుగా ! నీకోర్కె లేమున్నవి ! నన్ను మన్నించి సెలవొసంగుము. నీవాంఛితము సఫలంబు గావింతును.

వామ— దానకౌతుకసాంద్రా! దానవేంద్రా! అభ్యాగతుండనగు నన్నుమన్నించి గృహమేధివగు నీవుబలికినపలుకులు ధర్మయుక్తంబులుగనే యున్నవి. నాస్వాంతము సంతోషాక్రాంత మైనది. నైన నీ వాడు నుడువులకు సదుత్తరంబు లిచ్చెద! సావధానంబుగా నాలింపుము.

ద్వి ప ద.

ఇదినాదు నెలవనియెట్లువల్కుదును ముదమున నెల్లెడన్ మొనసియుండెదను
ఎవరివాడనటంచు నేమి దెల్పుదును భువనంబులను నేనె ప్రోతునువినుము
యీనడవడియని యెటులవచింతు పూనిముప్పోకల బోవగనేర్తు
నదినేర్తు నిదినేర్తునని యేమిచెపుదు విదితమౌనేర్పులు వేర్వేరనేర్తు
పనులునాకెవ్వరు పాల్పడరారు యొరులకే నొచుందు నొప్పుమీరగను
సిరిమోడుగా గద్దుజెన్నొంది ముందు సరసుల మదిలోన జక్కగానుందు
ననువొంద నావృత్త మట్లుండనిమ్ము జననాధనీ మాటసత్యంబునగుచు
నలరారెడు భవత్కులాగ్రంబు నోము విలసితధర్మమై వెలయుచునుండె
కరుణానువర్తులు ఘనసత్వమూర్తు లురుదానశౌండులు నుదతవిక్రములు
గాని మీకులమున గలుగరు వినుము మానకీర్తులు సర్వమాన్యులుగాని
రణభీరువులు వితరణభీరువులును గణుతింపగా లేరుఘనులు మీతాత
లందరు వరయశంబాదిన వార లందున బ్రహ్లాదుడతి గుణాహ్లాదు
డగుచును హరిభక్తుడై చరియించె దగు కీర్తితోడ చంద్రసమానుడగుచు
సుగతినైయుండుట సురుచిరలీల నెగడె మీవంశంబు నీరధిభంగి

తొల్లి మీ మూడవతాత హిరణ్యాక్షుండు విశ్వంబు జయించి గదాయుధుండై మహీతలంబున బ్రతివీరులగానక సంచరింప హరివరాహరూపంబున నతని బొలియించె తద్భ్రాతయగు హిరణ్యకసిపుడు విని యీ హరి పరాక్రమంబున కచ్చెరువంది తనజయంబును బలంబును బరిహరించుకొని తద్దయు నుద్ధవిడి నద్దనుజమర్దను నివాసంబునకు జనయెనపుడు.

క. శూలాయుధహస్తుండై ♦ కాలాకృతివచ్చు దనుజుఁగని విష్ణుండున్
కాలజ్ఞత మాయాగుణ ♦ శీలత నిట్లని తలంచె జిత్తము లోనన్.

మ. ఎదురై పోరజయింప రాదితనిగా కెందేనియున్ బోవభీ
ప్రదుడై ప్రాణులదోలుమృత్యువుక్రియన్ బైవచ్చునంచున్ క్రియా
విదుడబ్జాక్షుడు సూక్ష్మరూపమున నాఁశేశించె నిశ్వాసరం
ధ్రదిశన్ దైత్యు హృదంతరాళమున బ్రత్యక్ష క్రియా ధీరుడై

అప్పుడా దైత్య వల్లభుండు—

మత్తకోకిల. పారిజాక్షుని గెల్తునంచును ♦ వైష్ణవాలయ మొందియా
శౌరిగానక నాకసంబును స్వర్గభూములు కానలున్.
ధారుణీస్థలి క్రిందిభాగము దాపిమర్న మొనర్చినా
వైరి యోడెనటంచు జాటుచు వైరమున్ విడనాడె దాన్

కం. పగవాడు మడియనోపును
దెగడేనియు నెదురుపడడె ♦ దెగువసరులకున్
దెగిన యెడ బగరమీదను
బగగొనదగదనుచుమానె ♦ బ్రాభవ శక్తిన్.

ఆతండు మీ ప్రపితామహుండు ఆతని గుణంబు లగణ్యంబులై యుండెనవి యట్లుండనిమ్ము.

కం. ఆతుర భూసురగతి పురు
హూతాదులు దన్ను వేడ ♦ నొగిగొమ్మనుచున్
మీతండ్రి యిచ్చెనాయువు
నే తన్మాత్రుడవెనీవు ♦ నీలోకమునన్.

దానవేంద్రా ! విశ్వవిఖ్యాత కీర్తిసాంద్రా !

కం. ఏలితివి మూడుజగములు ♦ దోలితి, వింద్రాదిసురలదొల్లిటివారిన్
బోలితివి దానగుణముల ♦ జాలితివి పిశాచరాక్షసాదులబ్రోవన్.

అదిగాక !

మత్తకోకిల. మున్ను నిన్నిది దెమ్మటంచును బూని బాధ యొనర్పలే
దెన్నడున్ బరువేడ లేదిటు లెద్దియున్ దను జాధిపా

చెన్నుమీరగ రాజ్యసంపద జెందియుండియు నార్యులన్
మన్ననల్ రచియించి యీయక మాన్యుడెట్లగు రాజుదాన్.

క౦. రాజ్యంబు గలిగెనేనియు
పూజ్యులకును యాచకులకు • భూమి సురలకున్
భాజ్యముగ బ్రతుకడేనియు
త్యాజ్యములగు వానిజన్మ • ధనగేహంబుల్

మత్తకోకిల. మున్ను నిన్న గణించుచుందురు భూతలంబున దాతలన్
సన్నుతించి గణించు వోటను సత్యమో దనుజోత్తమా
యెన్నిసారులో ఇందునేనిట కెప్పవచ్చుట లేదునిన్
నెన్నదైనను బెట్టుమంచును నేచలేదసురాధిపా.

కావున నేమిగావలెనని నన్నడిగితివిగావున వచ్చుండనగుటంజేసి—

సీ. భూములున్ ఘనమైన సీమలున్ సొగసైన
రామలున్ మేలైన గ్రామములును
గోవులున్ దులలేని దీవులున్ రతనాల
ప్రోవులున్ ముత్యాల నేవళములు
కోటలున్ దోటలున్ పేటలన్ వరహాల
మూటలున్ శాటులు హాటకములు
కుందంబులును మంచి గందంబులును దివ్య
మందిరంబులు మహాస్యందనములు

గీ. వాజు లిభరాజులును ఫలభూజములును
కుండలంబులు నవరత్న మండనములు
పటుజపతపంబు లొనరించు వటునకేల
దాన గుణసాంద్ర వినుమిటు బానవేంద్ర !

ఆ. వె. ఒంటినాడ నాకు నొకటి రెండడుగుల
మేరయిమ్ము సొమ్ము మేరయొల్ల
గోర్కెదీర బ్రహ్మ కూకటి ముట్టెద
దానకుతుకసాంద్ర ! దానవేంద్ర !

బలి—(మందహాసము చేయుచు) ఆహా పరమయాచకా యిట్టికొద్దికోరిక గోరితివి ! నీచమానవు నడిగినట్లడిగితివి ! యిందు కేమందును.

ఆ. వె. ఉన్నమాటలెల్ల నొప్పుదు విప్రుడ
సత్యగతుల వృద్ధ సమ్మతంబు
లరుగదలచి కొంచె మడిగితివో చెల్ల
దాత పెంపుసొంపు దలపవలదె !

నాదు పెంపుసొంపు నారసి కోరికదీర గోరుకొనలేరవైతివి సుమీ? భూమిసురా ?

మ. వసుధాఖండము వేడితో జగములన్ వాంఛించితో వాజులన్
వెస నూహించితొ కోరితో యువతులన్ వీక్షించి కాంక్షించితో
పసి బాలుండవు నేరనివాడవుగ నీ భాగ్యంబు లీపాటిగా
యసురేంద్రుండు బదత్రియంబడుగ నీ యల్పంబు నీనేర్చునే.

ఇటు లత్యల్పంబగు కోరిక గోరితివి అదియే నేమని మెచ్చి హెచ్చి యిచ్చెదను పరమ యాచకా.

వామనుడు—(చిరునవ్వునవ్వి) దానగుణాభినివేశా ! దానవాధీశా ! విశదముగ వినుము.

మ. గొడుగో జన్నిదమో కమండలువొ నాకున్ మౌంజియో దండమో
వడుగే నెక్కడ భూములెక్కడ కరుల్ వామాక్షు లశ్వంబులె
క్కడ నిత్యోచిత కర్మమెక్కడ మదాకాంక్షా మితంబైన మూ
డడుగుల్ మేరయె తోయకిచ్చుటది బ్రహ్మాండంబు నా పాలికిన్.

జప తపానుకూలంబులగు బరికరంబులు దక్క తక్కినవస్తు వాహన కనకమణి భూషాంబరాదులు వటున కర్హంబులగునే ? నీవు మహాదాత్రవగుదు వందుకు సందేహంబులేదు ! గావున నేనడిగినది నీవు మరగక నిడితివేని దాని వలననే బరితృప్తి నొందెదను ! అదిగాక !

క. వ్యాప్తింబొందక వగవక
బ్రాప్తంబగు లేశమైన పదివేలనుచున్

దృష్టి జెందని మనుజుడు
సప్తద్వీపములనైన జక్కంబడునే!

శా. ఆశాపాశము దాగడున్ నిడుపులే దంతంబు రాజేంద్ర వా
రాశి ప్రావృతమేది నీవలయ సామ్రాజ్యంబు చేకూరియున్
గాసింబొందిరి గాక వైన్యగయ భూకాంతాదులున్నర్థ కా
మాశన్ బాయగనేర్చిరే మును నిజాశాంతంబులున్ జూచిరే!

కావున—

ద్విపద.

సంతోషి నిరతంబు జగతి బూజ్యుండు సంతోషికెయ్యెడ సర్వసుఖంబు
సంతుష్టిలేకుంట సంసారసరణి సంతసమున ముక్తి సతియును దొరకు
పుష్టిమీరంగ నీపుడమిలో నల్పతుష్టిని తేజంబుతోడ నేపెరుగు
పరితోష హీనతన్ ప్రభ జెడిపోవు వరవారిధారల వహ్నియుబోలె
నీవు దాతవటంచు నిఖిలమడుగుటయు పావనమునుగాదు పాటియుగాదు
నాకుదగినలీల నయము వేడితిని—వీక మూడడుగుల పృధివియేయిమ్ము!

అటుల నీవిపుడిచ్చితివేని నాకదియ చాలుచాలు దానవేంద్రా!
సాహసాది గుణసాంద్రా!

బలి—'సాహసౌదార్యాదులు వెలయ' అటులైన సకలవిద్యాపటుండ వగు వటుడా నీవిటులిమ్ము! సమ్మతంబుగా నుర్వీదానంబు గావించెదను.

శుక్రా—'తొందరగా లేచి' బలింజూచి' బలిదానవేశ్వరా! సర్వేశ్వరుండని యెఱుంగక నీఖర్వుండగు నుర్వీసురున కుర్వీ దానంబుగా నీదలంచి కరకలిత సలిలక మండలుండవు వితరణగుణము ఖరుండవునై ముదముగా నిట్లు వల్కుచుంటివి కాని యిటు వినుము.

ద్విపద.

దనుజేంద్రయితడసత్య మహీసురుండువిను దేవకార్యంబువేడ్కసాధింప
హరి విష్ణుడవ్యయుండ దితిగర్భమున వరకశ్యపతపః ప్రభావంబువలన
తనయుడై జనియించి తనరారుచిటులమొనసె నీవదియెల్ల మునుకొనివినక
నెరుగకీతని కోర్కెని చ్చెదనంటి ధరణి దైత్యులకుపద్రవము వాటిల్లు

నీలక్ష్మి తేజంబు నెలవును సిరియు వాలాయముగ గొని వజ్రికి నొసగు
మొనసిముజ్జగములుయూడు పాదములఁగొనివిశ్వకాయుడగుచునాక్రమించు
సర్వధనము విష్ణు సాత్కృతిజేసి యుర్విని వసియించి యుండెదవెట్లు
బడుగువగుచు నీవు ప్రబలుటయెట్లు యిడకు మీపనిగూడ దింతియకాక
నొకపదంబునభూమినొక్కటదివముప్రకటంబుగాద్రొక్కిప్రబలియాతండు
నిన్నుబద్ధునిజేయు నిజముగానిపుడు మన్నించి నామాటమదనెంచివినుము
దిక్కులుగగనంబుదివముతానగుచో నెక్కడనుండెద వెట్లొదు చెపుమ !

జంఝూటిరాగము—ఆదితాళము.

తగవు కాదుకాదు ! నీకిది ||తగ|| నామాట నగవు కాదుకాదు.

1. జగమునసే దానమునను నాశన । మగునది యిడరాదనిరి కోవిదులు తగనొసగెదని యిపుడీయ్యవిచో। నగునరకముద్రోవగల నెదేవా||త||
2. దానధర్మములు తపము కర్మములు । తాను ధనికుడై సలుపవల యునట । దాన, కీర్తి విలసిల్లు జగములను । దానకుతుకసాంద్రా । దానవేంద్రా ||తగవు||
3. నిర్మలమతివై తన ధనమంతయు । ధర్మకీర్తి కామార్థా శ్రితులకు మర్మమెరిగి యైదుభాగములుగా । నర్మిలి విభజించి యొసగవలె నిటు ||తగవు||

యీమాయా వాదనపటుండగు వటుని కుటిలత నీవెరుంగ వైతి విక నీరాజ్యంబుగొని యిందునిన కీయదలంచి వచ్చిన యుపేంద్రుండు గాని భూసురేంద్రుండు గాడు సుమీ దానవేంద్రా !

భలి—"అట్టహాసంబు చేయుచు" ఆహా యేమిటీ అటులనా ! ఆచార్య వర్యా! నామాట యొకటి పాటించి వినుము.

ద్విపద

నిజమానతిచ్చితి నీవు మహాత్మా ! భజియింపదగు నీదు పాదంబులైన
నర్థంబుకామంబు నడిగినదెల్ల । నర్థికిచ్చెదనని యర్థలోభమున

నిటువంటి బోధనలింపుగా వినుము వటుని బొమ్మనుటది పాటిగాదయ్య
పలికి బొంకుటకన్న పాపంబుగలదె వలను దుష్కర్మ భరియింతుగాని
సత్యహీనుని మోయజాల నటంచు యత్యంత భారమైయనువుగా దాను
బలుకదే భూదేవి బ్రహ్మతో మున్న తలపగా నవిమానధనులకు రెండు
పలికి బొంకమియును బటుయుద్ధములను దొలగమియును చాల దు
దూగుచుండ

నిల నంతకన్న మేలెద్దియు గద్దు విలసిల్లు నాకోర్కె విను గురువర్య
ధాత్రి పాలికునకు దగ నొక్కచోట క్షేత్రంబుబీజముల్ చేకురుభంగి
క్షేత్రిగులై విలసిల్లు జాతలకు పాత్రంబు సమకూరు భాగ్యంబుకన్న
మరి వేరయున్నదే మాటలికేల పెరపయ్యె సత్యంబు విడువగజాల.

శా. కారేరాజులు రాజ్యముల్ సలుపరే ♦ గర్వోన్నతిం జెందరే
వారేరీ శిరి మూటగట్టుకొని ♦ పోనాజాలిరే భూమిపై
పేరైనంగలదే శిబి ప్రముఖులున్ ♦ బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కులు వారలన్ మరచితే ♦ యికాలమున్ భార్గవా.

క. ఉసుగని వ్రితముల గ్రితువుల
బొడగన రానట్టి పొడవుపొడవున గురులై
యడిగెదు నట నాబోటికి
సిడరాదె మహానుభావ యిష్టాగంబుల్.

శుక్రుడు—అది సరియేగాని యనర్థంబు గలుగునపు డంగీకరించదగిన వృద్ధ ధర్మంబులు గలవవి వివరించెదను వినుము దనుజేంద్రా?

బలి—గురువర్యా! చిత్తము చిత్తము.

శుక్ర-సీ. అంగీకరించిన నఖిలంబు బోవునో
నన్నృతంబు గాదు లేదనిన నధిప
నాత్మవృక్షము మూల మన్నృతంబు నిశ్చయ
మాత్మమూలముగల యాత్మజెడను
పుష్పఫలంబాత్మ భూజంబునకు సత్య
మామాని బ్రతుకమి నదియు జెడును

ఫలపుష్పములు లేక పసజెడి వృక్షంబు
మూలంబుతో వృద్ధి బొందుగాదె

గీ. చేటుకోరతయు లఘిమయును జెందకుండ
నిచ్చు పురుషుండు జెడకుండు నిద్ధచరిత
కాక సంచిత సత్యసంగతి సటించి
నిజ ధనంబర్థికిచ్చిన నీకులేదు.

యీయర్థంబున కింకొక విశేషంబుగల దాలకింపుము.

గీ. వారిజాక్షులందు వైవాహికములందు
ప్రాణవిత్తమాన భంగమందు
చకిత గోకులాగ్ర జన్మరక్షణమందు
బొంకవచ్చు నఘముబొంద దధిప.

మ॥ కులమున్ రాజ్యము దేజమున్ నిలుపు మీకుబ్జుండువిశ్వంభరుం
డలతిన్ బోడు త్రివిక్రమస్ఫురణ వాడై నిండు బ్రహ్మాండమున్
గలడే మాన్పనొకండు నాపలుకులా కర్ణింపు కర్ణంబులన్
వలదీ దానముగనమున్ బనుపుమా వర్లిన్ వదాన్యోత్తమా !

బలిచక్రవర్తి—క్షణమాత్ర మాలోచించి ప్రకాశముగా

మ॥ నిరయంబైన నిబద్ధమైన ధరణిన్ నిర్మూలనంబైన దు
ర్మరణంబైన కులాంతమైన నిజమున్ రానిమ్ము కానిమ్ము పో
హరుడైనన్ హరియైన నీ రజభవుండ ఖ్యాగతుండైన నా
దిరుగన్ నేరదునాదుజింహ్వ వినుమా ధీవర్య వెయ్యేటికిన్ !

క. మేరువు తలక్రిందైనను పారావారంబు లింక బారిన లోలో
ధారుణి రజమైపోయిన తారాధ్వము ఖండమైన దప్పక నిడుదున్॥

గీ. నొడివినంతమట్టు పుడమినొసంగుచో నేలకట్టు విష్ణుడేటిమాట
గట్టినేని తానె కరుణించి విడుచును విడువకుండనిమ్ము విమలచరిత॥

ఆచార్యవర్యా—యింకా నిశ్శంకగా నొసంగెదనే కాని బింకంబుదక్కి-
బొంకజాలను.

## చతుర్థాంకము

### పున్నాగరాగము—ఆదితాళము.

బొంకజాల నయ్యా ! అయ్యా ! గురువర్యా నే ||బొంక||

కొంకక నెయ్యెడబొంకెడుదుష్టుల_శంక లేక యమకింకరుల్ బాధింతురు|బొం|

కోరినకోరిక దీరుతునంటిని తీరుగనిప్పుడు నానోరెటులాడును ||బొంక||

ముజ్జగములు దన బొజ్జనుగలహరి గుజ్జురూపముననాపజ్జనునిలువగ|బొం|

ధరణీశులు శిష్ట-ధరణీసురలు మంత్రి వరులున్నసభలోన గురునిసమ
ఖమున ||బొంక||

వరగోపబాలుని-చరణార్పణముగా-నిరతము గ్రతువులు నెరపెడు దీ
క్షలో ||బొంక||

ముజ్జగంబులనేలు ప్రోడ ! గుజ్జువేల్పు ! నాపజ్జనిలచి యడుగు
చుండ నీ సజ్జన సమాజంబు వినుచుండ నీసన్నిధి నెట్లు బొంకు
దు గురూత్తమా !

(అపుడు వామనుడు బలిని జూచి) దరువు.—

### యమునా కళ్యాణి (ఆదితాళము)

1 నాకోరికలోనగూర్చి పంపుమిక_నయగుణసాంద్రా! దనుజేంద్రా! |నా|
2 చేకొందువు శాశ్వతమగుకీర్తిని_ప్రాకటముగను ద్రిలోకము లెన్నగ|నా|
3 ధరణిలోన బహుదాతవనుచు విని_దరిజేరితి పాదత్రయిగోరితి |నా|
4 కావ్యనిబోధన ఘనమని యెంచిన_భావ్యముగాదిహ పరములు గలు
గవు |నా|
5 మోహజలధిలో మునుగ కుంటివా_సాహసి యని నిను జనులు వొగ
డెదరు ||నా||
6 మురియుచు నూతన పురిలో వెలసిన_వరద వేణుగోపాలుడేలు నిను|నా|

రక్కసులఱేడా ! కావ్యుని మాట భావ్యంబుగా నెంచి తడవుసేయక
వెనుకదీయక నాయడిగిన మూడడుగుల పుడమిని నిడుము.

(అన విని వామను జూచి) దరువు కమాచిరాగము_ఆదితాళము.

బలి— నీ మనోరథము నెరవేర్చెద నిదె_నిర్మల విద్యాపటుడా!
వటుడా ||నీమ||

2. భూమిదానమిదు పుణ్యమూర్తియని-భూమి జనులు నను బొగ
 డు నటుల నిట ||నీమ||
3. దానకుతుక సాందుద్రిడగు గదాబలి-దానవేంద్రుడని మానవు
 లెన్న గ ||నీమ||
4. మూడుజగంబులు ముచ్చటింపనీ-మూడడుగులనడిగిన పుడమి
 నొసగి ||నీమ||
5 వరదుడైన గోపాలమూర్తిని-స్మరణజేసితత్పదార్పణముగా|నీమ|
 అని యొప్పజెప్పి శుక్రుంజూచి (ఆచార్యవర్యా!)

శా. ఆదిన్ శ్రీసతి కొప్పుపై దనువుపై హంసోత్తరీయంబుపై
 పాదాబ్జంబులపై గపోలతటిపై బాలిండ్లపై నూత్న మ
 ర్యాదంజెందు కరంబు గ్రిందగుట మీదైనా కరంబుంట మే
 ల్గాదే రాజ్యము గీజ్యమున్ సతతమే కాయంబు నాపాయమే.

అదియునుంగాక నితండు___

మత్తకోకిల. ఎన్నఁడుం బరు వేడ బోడట ♦ యేకులంబట కన్నవా
 రన్నదమ్ములు నైన లేరట ♦ యన్నివిద్యల మూలగో
 ష్ఠి న్నెరింగిన ప్రోడగుజ్జట ♦ చేతులొగ్గి వసింపనీ
 చిన్నిపాపని ద్రోసిపుచ్చగ ♦ జిత్తమొల్లదు సత్తమా.

శుక్రా___(అట్లు బలుకుచున్న బలింజూచి కోపించి.)

క. పూజ్యుడవై మద్బుద్ధికి ♦ భాజ్యుడవై మెలగవైతి వటసంపదచే
 త్యాజ్యుడవుగాన నీవిక ♦ రాజ్యభ్రష్టుడవుగమ్ము రాక్షసకులజా!

నామాట వింటివేని నీకు నాకలోకాధిపత్యము చేకూరుననియు
 లేకున్న నధోలోక ప్రాప్తియు నని మొదటనే నేను నిశ్చయిం
 చుకొని సూచనగా నుడివి నాడను. కావున నీవిక రాజ్యపద
 భ్రష్టుండ వగుదువుగాక.

బలి___(ఆమాటవిని)

క. విశ్వేశ్వ రార్పణంబుగ ♦ శశ్వన్మోదమున నే నొసంగ దలచితిన్
 శాశ్వతసంపద లిడిమెచ్చు ♦ విశ్వేశుడెనన్ను బ్రోచు వేట్కనుశావ్యా.

సర్వంబును పరమేశ్వరార్పణముగా నీదలంచితి నికనీమాటలేల !
నన్ను భక్త పరిపాలుండగు వేణుగోపాలుండే పరిపాలించుగాత
(అని వింధ్యావళివంక జూచి) ప్రాణనాయకీ నీయభిప్రాయమేమి.

వింధ్యావళి—

క. కావ్యుండాడిన మాటలు ♦ భావ్యములని మానవలదువసుధాదానం
బవ్యాహతి నిడుము జగ ♦ త్సేవ్యుండగు వామనునకుజెలువుగనాధా!

బలి—(అదివిని వామనుంజూచి)

క. రమ్మా ! మాణవకోత్తమ ♦ లెమ్మా ! నీవాంఛితమ్ము లేదనకిత్తున్
దెమ్మా ! నీయడుగులనిటు ♦ నిమ్మా ! కడుగంగవలయు నేటికిదడయన్.

(అని మరల కవిరాజవిరాజితము)

నిరతము శ్రీకరణంబులునై తగు ♦ నిచ్చలుసర్వ సుపర్వసము
ద్ధరణములై యల వేదశిఖాళికి ♦ దామె యలంకరణంబులునై
బరగు భవాంబుధి సంతరణంబులు ♦ పండిత సంస్మరణంబులు నీ
చరణము లీయెడసాచు మహాత్మక ♦ క్షాళనమున్ రచియింతునికన్.

(అని వింధ్యావళింజూచి) ప్రాణనాయకీ యీ వటుని పదంబులు
గడుగుటకు కనక కలశంబున జలంబు వోయుము.

వింధ్యావళి—చిత్తమట్లనే సేయుదును.

కం. శ్రీదములధిగతపరమా
మోదములగు వటుని పాదములు గడుగుమిదే
శ్రీదయితుని దలచుచునే
నోదయితా జలమువోయు చుండెద నెలమిన్.

(అని కనక కలశముతో జలము వటుని పదములపై వంపుచున్నది.)

బలి—(వామనుని చరణంబు కడిగి) ప్రాణనాయకీ !

వింధ్యా—ఏమి ! ప్రాణనాధా !

బలి—దురితహరణంబులగు నీ మహాత్ముని చరణంబులు గడిగితిని !
తత్పావనజలంబులు మన శిరంబులం జల్లుకొందము (అని యిరు
వురును శిరంబుల జల్లుకొనుచున్నారు)

వింధ్యా—ప్రాణనాథా ! యీ మహామహుని యడుగుదమ్ములు మన చేలాంచలంబుల దడియొత్తి కన్నుల నద్దుకొందము. (అని యిరువురు కనుల నద్దుకొను చున్నారు.)

బలి—(వాక్ఛుచియై దేశకాలాది పరిగణనంబు చేసికొని) ప్రకాశముగా (వామనుంజూచి) మహాత్మా !

మత్తకోకిల.

ధారుణీ పతులెల్లజూచి యు ♦ దారు డంచును మెచ్చగా
ధారవోసెద భూమిగైకొను ♦ ధారుణీ విబుధోత్తమా !
నేర మెంచకు శుక్రబోధన ♦ నే నెరుంగను సత్తమా
పారమార్థిక బుద్ధినెంచితి ♦ భవ్యమైన మనీషతోన్

వామ—అవునౌను ! నీ విటులనే కావించితి వది నామనంబున సంభావించి సంతసించుచునే యుంటని! (అనిదోసిలివట్టియెదుటనిలిచి)

మత్తకోకిల. ధారుణీసురులెల్లగాంచి యుదారుడంచును మెచ్చగా
ధారవోయుము మామకాంజలి దాల్తు దానవనాయకా
నేరమేమియు లేదు శుక్రుని నిర్ణయోక్తుల డంచియా
పారమార్థిక బుద్ధినెంచితి భద్రమైతగు కార్యమున్.

ఆ. వె. బ్రతుకవచ్చుగాక బహుబంధనములైన వచ్చుగాక లేమివచ్చుగాక
జీవధనములైన జెడుగాకపడుగాక ♦ మాటదిరుగ లేరుమానఘనులు!

దానవేంద్రా ! నీబోటి మానఘనులు మాటదిరుగలేరుగదా ?

బలి—అందుకు సందేహ మేమున్నది! మహాత్మా నిక్కమే వక్కాణించితివి, "అని జలకలశంబుగైకొని"

సీ. విప్రాయకపటాయ విష్ణవేకుబ్జాయ సర్వేశ్వరాయ విశ్వంభరాయ
శ్రీరమారమణాయ శ్రితపాపహరణాయ తత్వాత్మనే జగత్కారణాయ
యజ్ఞేశ్వరాయ మహాయజ్ఞరూపాయ చక్రహస్తాయ త్రివిక్రమాయ
మందారువాంఛిత సంధాయకాయబృందారకమందార భూరుహాయ

గీ. వారమెుభవతేహ మద్యదాస్యామిభూమి
ముంచితపదత్రయాంసదయంగృహాణ

భావుకందేహి మాంపాహి దేవదేవ
భాసమానస్వభావ (శ్రీ) వాసుదేవా.

వామనా! సర్వలోకప్రశస్తంబగు నీహస్తంబున సర్వలోకాధారమగు నీ దానధారం బరిగ్రహింపుము.

వామనుడు—"కృతాంజలియై మందహాసంబుచేయుచు"

కందార్ధము-ఇదియేమిటడుగుటనినీమదికలగకధారవోయుమాదనుజేంద్రా
ముదమొదవగమత్కాంక్షిత మిదిమొసగుటె ముజ్జగంబు లిచ్చుట
మాకున్ నేటికిగల్గె ముచ్చటనీకున్!
విచ్చలవిడిగనే పెచ్చుపెరిగినేడు హెచ్చిమిన్నంటుదు నిచ్చమెయి
"సర్వమిచ్చుట మాకున్"
గ్రిచ్చుకొని పాదత్రయంబున జెచ్చెరన్ లోకత్రయంబును బుచ్చి
కొందనుసురలుమెచ్చగనిచ్చితివిమేలిదియెవిశ్వమిచ్చుటమాకున్

బలి— "ఆ మాటలువిని"

ఉ. పుట్టియెనేర్చితోయిటుల పుట్టకనేర్చితో పొట్టిరూపుతో
పుట్టెడుచిట్టిబుద్ధులవి పొట్టనుమట్టుగబెట్టి పుట్టినా
గుట్టునుమట్టునుందెలిసి కూరిమిమీరగ భూమిదానమున్
బట్టితివైననన్నిటుల బద్ధునిజేసెను ముక్తిదాయకా.
అని ధారవోయుచున్నాడు. వామనుడు పరిగ్రహించుచు

వామనుడు—క. క్షితిదాన మొసగునతడును
నతికాంక్ష బరిగ్రహించు నతడును దురిత
చ్యుతులై శతవత్సరములు
శతమఖలోకమునగ్రీడ సల్పెదు రెలమిన్.

క. ఇలలోపలగలదానం బులలోభూదానమిదియ పొగడొందబడున్
దెలిసియొసివదియొసగితి విలసితకీర్తియును సిరులు వెలయగభళిరా.
పరమేశ్వరార్పణంబుగా భూదానంబొసగితిగావున నీవీ వసుమతిని
శాశ్వతయశుండవై వెలయుచుందువుగాక! దానవేంద్రా!
(అని చేతనున్న ఝారీచెంబును బరిశీలించి) ఆహా! దాన

వేంద్రా ! వితరణ కుతూహలసాంద్రుడవై నీవీ భూదానంబు చేయుచుండసహింపజాలక కామరూపవకుంచగుశుక్రుండుదానీ కలశరంధ్రంబున కడ్డుదూరి వారి ధారను జారనీకున్న వాడిటు జూచితివా ! (అని చేతినున్న దర్భపుడుకతో కలశ రంధ్రంబున బొడుచుచున్నాడు)

బలి—ఆహా ఆలాగున నేమిమహాత్మా ! యీసారి ధారాళంబుగా వారి ధార జారుచున్నదిక పరిగ్రహింపుము. (అని మరల జల కలశంబు వంపుచున్నాడు)

వామ—(దానధారను పరిగ్రహించి) యిట్టి సత్కార్యంబున కడ్డుదూరిన గుణవక్రుండగు శుక్రుండు నేటిగుండి యేకాక్షియై యుండుగాక ! (అని దానధారను పరిగ్రహించుచున్నాడు)

(అంత మేధావి యనునతడు లేచి సభవంకజూచి)

మేధావి—కం. మునిజననియమాధారను
జనితాసుర గురు సునేత్ర జలకణధారన్.
దనుజేంద్రు నీరధారను
వనజాక్షుడు గొనియె బలి వివర్జిత ధారన్.

శుక్రుని కన్నువొడిచి యా కన్నీటితోపాటు దానధారనుగూడ గ్రహించి నాడీ వామనుడెంతటి నిపుణుడో చూచితివా ప్రబుద్ధా !

ప్రబుద్ధుడు—అవునౌను రెండుకన్నులతో నిట్టి సత్కార్యమును చూడలేక తానడ్డము వచ్చినందుకా శుక్రునికట్లు కాదగినదే దానికేమిగాని !

కం. హరినెరిగిదేశకాలము ♦ లెరిగియుగురునుడువులెరిగియెంతయునాశం బెరిగియు గురిదాటకదా ♦ వరపాత్రమటంచునొసగెబలిదానమిలన్.

ఆహా! దేశకాలపాత్రాదుల నెరింగి యిట్లొసంగిన బలిచక్రవర్తి వంటి పుణ్యమూర్తి నెచ్చటనైన గనివినియుంటిమే.

మేధావి—ఆహా బలి యేమివదాన్యుడయ్యా!

శ్లో. గురోరప్య వలిప్తస్య కార్యాకార్యమజానతః।
ఉత్పథప్రతిపన్నస్య న్యాయోదండో విధీయతాం॥

అని యన్నట్లు—శుక్రుని వక్రోపదేశంబువినక శిక్షకు పాత్రునిగా జేసి వాసిమీర నిచ్చినా డీతడే ధన్యుఁడు.

విదూషకుడు—ఆహా! మాబాగుగా మెచ్చుచున్నారే. యిదియే కాబోలును! అహాహా మూలచ్ఛేదితవపాండిత్య పరీక్షా—

"అనునట్లు" యెట్టి పాత్రమైనను చేయికొట్టి చేతికిచ్చువారెచ్చటనైననుందురా! యికనేమున్నది! బలిచక్రవర్తి రాజ్యము బోయెను. శుక్రాచార్యునకు కన్నుబోయెను. దైత్యులకు సిరి తొలగిపోవునని విచారించుటచేత నొక కన్ను పోయినదిగదా! దేవతలకు మహావిభవమబ్బినదని విచారిస్తే రెండవకన్ను కూడా పోవకమానదు—సరే బాగుగానున్నది.

చండామార్కులు—అగ్నికార్యావశిష్టంబులు దీర్పవలసియున్నది. యిట్లు రమ్ము దానవోత్తమా.

బలి—చిత్తము (ఆలాగునే అని వింధ్యావళీసమేతుడై వామనాములతో లోపలకు వెళ్లుచున్నారు.)

చతుర్థాంకము సంపూర్ణము.



# మహేంద్రవిజయము.



## పంచమాంకము.

ఇర్వురుగంధర్వు లాకాశమార్గమునవచ్చి ముచ్చటించుకొనుచున్నారు.

1 గంధ—నెచ్చెలీ! చూచితివా! త్రివిక్రముని నిర్వక్రమంబులగు విక్రమ విలాసాదు లెంతవింతగా నున్నవి:—

శా. ఇంతింతై వటుడింతయై మరియు దానంతైనభోవీధిపై
నంతైతోయద మండలాభ్రమున కల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రుని కంతయై ధ్రువునిపైనంతై మహద్వాటిపై
నంతై సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంతసంవర్ధియై.

2 గంధ—అవును నెంతచిత్రముగానున్నది. ఆహా! ఎంత విచిత్రమును గాంచితిమి. "ఆశ్చర్యముతో"

మ. రవిబింబంబుపమింపబాత్రమగు ఛత్రంబై శిరోరత్నమై
శ్రవణాలంకృతమై గళాభరణమై సౌవర్ణ కేయూరమై
ఛవిమత్కంకణమై కటిస్థలినుదంచద్వస్త్రమైనూపుర
ప్రవరంబై పదపీఠమై వటుడుదా బ్రహ్మాండమున్ నిండుచోన్.

ఆహా! యెంతవింతగానున్నది (అనుచుండగనంత తెరలో)

గీ. అరయవిశ్వాత్మకుండగు నాదివిష్ణు
డతులితవిలాసమున త్రిగుణాత్మకమగు
విశ్వరూపంబుధరియించి వెలయుచుండె
దశదిశల నాక్రమించిచా విశదముగను.

క. ఒకపదమున భూమియువే రొకపదమున దివముగప్పె నొప్పుగనిపుడీ
ప్రకటాకృతిగనుగొనుటకు చకితంబగుచుండెమాననముదనుజేంద్రా!

మరల ఆహా యేమి చిత్రముగానున్నదీ చూచితిరా!

గీ. ఒకపదంబు క్రిందనుర్వి పద్మమునంటి
కొనిన పంకలవము గొమరు మిగిలె
నొకటిమీది తమ్మి కొదిగిన తేటినా
వెలసె మిన్నునృహరి విక్రమమున !

మరల తెరలో ప్రార్థించుచున్నారు.

ఉ. నిన్ను నుతించ నేరమిక నేరములెంచక బ్రోవుమయ్య యా
పన్నశరణ్యదీన పరిపాలనలోల కృపాలవాలయో
పన్నగశాయి నార్తిజన భావుకదాయి త్వదీయ మూర్తిమా
కన్నుల గాంచ శ్రీమిపుడ గైకొను మాద్యపులీల నీశ్వరా !

ఈ విశ్వరూపంబు జాలించి తొల్లిటి రూపంబు నంగీకరించి పాలింపుము వామనా !

గంధర్వుడు—(అదివిని) ఆహా నెచ్చెలీ ! చూచితివా ! వారెట్లు బలుకుచున్నారో వినుచున్నావా ! ఎంత విచిత్రముగానున్నదీ!

సీ. ఘనరత్న కటక కంకణకౌస్తుభాన్వితుం
డనుపమమణి మేఘ లాంఛితుండు
కమనీయ వనమాలికా విరాజితుడును
పరిచరవాహినీ పరివృతుండు
హారకిరీట కేయూర సమన్వితుం
డతులిత హేమాంబ రాన్వితుండు
మాని తానూనానమూన తేజోబల
విక్రమాధికకలా విలసితుండు

గీ. శంఖచక్ర గదాఖడ్గ శార్ఙ్గదండ
నిర్మలాక్షయ బాణ తూణీరయుతుడు
నగుచు త్రిభువనముల నెల్ల నాక్రమించె
విశ్వరూపంబుదాల్చి త్రివిక్రముండు.

2 గంధర్వుడు—అవునౌనట్టి విశ్వరూపంబు ధరించునపుడు జయవిజయ సంద సునందాది బృందారక బృందములు గొలువ సత్యలోకంబునకువచ్చి యున్న యాహరి చరణంబుజూచి

సీ. భవబంధములువాసి బ్రహ్మలోకంబున
కాపురంబులుసేయు ఘనులు రాజ
లామరీచ్యాదులు నాసనందాదులు
నాదివ్య యోగీంద్రు లచటనెపుడు
మూర్తివంతంబులై మ్రోయు పురాణాంత
రామ్నాయనియమేతిహాసధర్మ
సంహితాదులు గురుజ్ఞానాగ్ని నిర్దగ్ధ
కర్ములున్ మరియును గలుగునట్టి

ఆ. వె. వారలెల్ల జొచ్చివచ్చి సర్వాధిపు
నంఘ్రిజూచి మ్రొక్కి రధికభక్తి
దమమనంబులందు దలచు నిధానంబు
గంటిమనుచు దేవమంటిమనుచు.

అది యంతయును సంతసంబున జూచినారముగదా ! మిత్రమా ! అదియునుంగాక !

మ. తనపుట్టిల్లిదె పొమ్మటంచు నజుడున్ దన్నాభి పంకేరుహం
బు నిరీక్షించి నటించి యున్నత పదంబున్ జూచి తత్పాదసే
చనమున్ జేసె గమండలూదకమునన్ జల్లించి తత్తోయముల్
వినువీధిన్ బ్రవహించె దేవనదియై విశ్వాత్మ గీర్తి ప్రభన్

1 గంధర్వుడు—చెలికాడా ! నిజము నిజము అట్టిసమయంబుననేగదా!

సీ. యోగమార్గంబున నూహించి బహువిధ
పుష్పదామంబుల బూజచేసి
దివ్యగంధంబులదెచ్చి సమర్పించి
ధూపదీపములు దోడ్తోడనిచ్చి
భూరి జాలాక్షతంబులజల్లి ఫలములు
గానుకలిచ్చి రాగముల బాగడి
శంఖాదిరవముల జయఘోషములు జేసి
కరుణాంబునిధి త్రివిక్రమయటంచు

ఆ. వె. బ్రహ్మమొదలు లోకపాలురు గొనియాడి
రెల్లదిశల వనచరేశ్వరుండు
జాంబవంతుడరిగి చాటిభేరీధ్వని
వెలయజేసె విష్ణు విజయమప్పుడు.

2 గంధ—అవునో నప్పుడాలాగుననే జరిగినది ! యిప్పుడీచ్చటకూడ నవ లోకించితివిగదా ?

కం. అన్నిజగంబులుదానై యున్న జగన్నాథుజూచి యోగిభావింపన్
గన్నందక మనమందక సన్నుతులనుజేసెనిపుడు సభ్యులు బలియున్ !

1 గంధ—నెచ్చెలీ ! నిజము నిజము మనముచ్చటయునూ మరలనిచ్చ టయునూ ! ముచ్చటమీఱ కన్నుల కఱపుదీర వీనులకు విందు గా ! నాహరి దివ్యరూప విలాసాదులు కనివిని యుంటిమి. తని విదీరె నిప్పటికి నిజనివాసములకేగి వత్తము రమ్మ !

(అని యిర్వురు వెళ్ళుచు) మరల

2 గంధ—మిత్రమా ! అటులవినుతించు బలినిపుడు వారుణపాశబద్ధుం జేసి నిరోధించుచుండెను ! గదా ! మరల నితనినివిముక్తునిజేయు నుగాబోలు నేమి.

1 గంధ—చెలికాదా ఆహరి బలిచక్రవర్తినేకాదు భక్తులనెల్ల కృపా బద్ధులం జేయునుగావున నితని సర్వస్వమును హరించి పిదప విముక్తుం జేయుచున్నాడు.

(అని యిర్వురును ముచ్చటించుచు వెళ్ళుచున్నారు.)

(బలి వామనులు ప్రవేశింతురు)

వామ—(వారుణపాశ బద్ధుండై యున్న బలిని నిరోధించియాక్షేపించుచు)

ద్విపద.

దానవోత్తమ గొప్ప దాతవీవాదు యేనును గైకొంటి నిదియల్పమనక
నైన మూడడుగులకదిజాలదయ్యెబూని యేనొకపాదమున గొంటిపుడమి
కడకతోనొకదాన గైకొంటి వినముకడమపాదమునకు గలదో కోభూమి
నొడివిలేదనుటకు నోరాడుచెనటి పుడమి నిందలనొందు పుణ్యాసులేదు

నిరయంబునొందును నిక్కంబుగాఁగ నరిగె దోదుర్గతి కటగానిచోను
మూఢవయంఘ్రికై పుడమియేనిమ్ము బాడబాధీనముల్ బ్రహ్మకునైన
దాఁత్రివశక్యముగాదు దురితంబుజెందు గావున నాకోర్కెకడముట్టనిమ్ము!

కందార్థము.

కరులా! హరులా! ధరలా! సరులా నాబోటికిట్టు లొసంగుట దగునే
ధరణిన్ గడులాఘవమని వరమతినాడితివి మున్ను వసుధాధీశా!
మరచితివా నీవసురాధీశా ?
పసిబాలుఁడను నీపాటి దెలియదాయె వెసనీవదాన్యత విశదముగాదాయె
నసురవర్యా కొంచెమడిగితి నంతమట్టుకె కొరతయయ్యెను
కసరుకొన కన్నృతంబులాడక కడమయడుగున కిడుము పుడమిని వసు
ధాధీశా ?
మాటకడమ పదమునకు ముదమున పుడమి నిడియెదవా ? నిక్కంబు
దక్క నిరయ మొందెదవా దానవేంద్రా ! నీవిందుకేమందువు?

బలి—(చిన్నబుచ్చుకొని)

క. నిరయమునకు దురమునకున్ ♦ చరబంధమునకును రాజ్యపదహీనతకున్
వెరువఁగ లేదనృతమునకు ♦ వెరచిన గతినేడు సుమతీ! విశ్వాధిపతీ!
మన్నించి నావిన్నపంబు లాలించుము.

గీ. సూనృతంబకాని నుడియదు నా జిహ్వ ♦ బొంకజాలనాకు బొంకులేదు
నీ తృతీయపదము నిజము నా శిరమున ♦ నెలవుజేసి పెట్టు నిర్మలాత్మ!

ద్విపద.

తల్లిదండ్రులు నన్నదమ్ములు సఖులు నెల్ల బంధువులలో నింపగువారు
పరమోపదేశముల్ బాగుగా దెలుపు గురువులు శిక్షింపగోరతయు వదున!
పిదప మేలగుగాక పృథులబలాఢ్య మదయుక్తుడను నన్ను మన్నించి మించి
విశ్వాస చక్షువుల్ వెలయనిచ్చితివి విశ్వాధిపతి నీవ విశ్వాంతరాత్మ!
గురువులలో నాదిగురుడవు నీవ కరమొప్ప నీవిట్లు గట్టనిగ్రహమొ
పరము బాయునో సిగ్గుబాధ యొతలప కరము వైరము బూని ఖలదానవాళి
మున్ను నిన్నెదిరించి పోరాడి పిదప జెన్నొంద మానులు జెందెడి ఫదము

నొందరే హర్షంబు నొందుచు దేవ ముందువై రముచాలబూనిపిమ్మటను
వరభక్తులైరి మావారలందఱును వరద నీయెడ దుర్లభము లేదులేదు
అదియునుంగాక !

మ. చెలియే మృత్యువు చుట్టమే యముడు సంసేవార్హులే కింకరుల్
శిలలన్ జేసెనె బ్రిహ్మాదన్ను దృఢమే జీవంబు నోజెల్లరే
చలితంబాట నెరుంగరీకపట సంసారంబు నిక్కంబుగా
దలచున్ మూఢుడు సత్యదాన కరుణా ధర్మాదినిర్ముక్తుడై.

దయాసత్య శౌచంబులు విడనాడు మూఢాత్ము లుసారహీనంబగు
సంసారంబునం జిక్కువడి చక్కగనిన్ను భజింపజాలరు జగత్పతీ !

కందార్థము.

ధనమస్థిరమతి చలనము దనువన్యులు కార్యపరులు దగుబుణబద్ధుల్
తనయులు చోరులు బంధువు లెనసిన సంసారమునకు హేతువలతివల్
బకృతికి మూల భూతములతివల్
ఆత్రతమగు గాలమాయుష్యమైశ్వర్య మేతఱినేగునో యెఱుగరాదని మా
తాత ప్రిహ్లాదుండు నీ పాదములు గొలువగ బ్రితుకు గలిగెను
బ్రీతి నీవిటు జేరికోరుట ప్రియముననో నా భాగ్యముననో హేతు॥

ఇటుల సమకూడినది గదా మహాత్మా !

(అంతట రాక్షసబలంబులు గొప్పకేకలువేయుచు నాయుధపాణులై
వచ్చి బలింజూచి)

రాక్షసులు—దానవలోకనాయకా ! శుభదాయకా ! యుద్ధమున కిపు
డు శెల వొసంగుము. మాసిత సాయకంబులచే నీ వామను
గీమనుం దునుమాడెదము.

ఉ. మారులగావు, మారు, యని మామకబాహుపరాక్రిమ క్రమో
దారతలెల్ల జూపుచును దక్కక నిక్కడ జట్టుముట్టిబల్
ఘోరసితాస్త్రశస్త్రముల గూల్తుము వామను గీమనున్ గులో
ద్ధారక మమ్ము బంపుమిక తప్పక దానవలోక నాయకా !

ఈ హరిం గిరిం బరిమార్చెదము మాకనుజ్ఞ నొసంగుము.

(అనుసంత)

మీనిన్ను ప్రార్థించుచుండెన్ భవత్పాద సేవాను రక్తిన్ గటాక్షించి
రక్షింపవే దేవదేవాన మద్భావన వాసుదేవా ! నమస్తే నమస్తే నమః

(అని నిష్క్రమించును).

(అంతలో బలిచక్రవర్తి తాతయగు ప్రహ్లాదుడు ప్రవేశించును)

బలి—(సవినయంబుగా) తాతాప్రహ్లాదా ! సర్వలోకరక్షామనుండగు
నీ వామనుండు నన్నిటుల వారుణపాశ బద్ధుం జేయుటవలన
మొక్కజాలనైతిని (అని దీనవదనుండై)

గీ. పరమపురుషుండు వారుణ పాశబద్ధు
గాగ నొనరించె నన్నిట్లు గాంతుజేసి
కాన మొక్కగలేనైతి కరుణజూడు
మహితలసదూహ మత్పితా మహనిరీహ !

ప్రహ్లా—(బలి చెంతజేరి కౌగలించుకొని యూరడించుచు)

కం. వగవకుము వత్సనీవిక ♦ వగతుండై కట్టలేదు భక్తులనెల్లన్
దగుకృపను గట్టివైచును ♦ భగవంతుడు శత్రుమిత్రభావముగనునే
అదియునుంగాక వత్సా !

కందార్థము. హరినిను యాచించుటయును
గరమరుదుగ పాశబద్ధుగా జేయుటయున్
దరిజేరి నిలచి పలుకుట
బరమకృపాధిక్యముగనె భావింతు మదిన్
నేనీవేళా! సేవింతు హరినీ
సేవకులముగాన చిత్తము గనుగొన
వేవేగమే యట్లు వెడలివచ్చె వత్సా
శ్రీవరుడు దానేమి జేసిన జేయదగునది నూనతనుగా
భావమునదలపోయుచెంతయు భావ్యమగు నాభక్తి యగునా?
సర్వ భూతదయాళుడగు హరి తన భక్తజనులను కృపాబద్ధులను
జేయును అహంకార మమకారంబులుగల పామరజనుల భవపా
శ బద్ధులంజేయును తానిర్గుణుడయ్యు నిపుడు గుణబద్ధుండై

యుండెగావున నిన్నిటు వారుణపాశబద్ధుం గావించెను. ముక్తిదాయకుండగు నీమహాత్ముని భావించి సేవించువారలకు భవబంధంబులు వాయు నీకీ వారుణపాశబంధంబుల నెంత పాత్రికా.

కం. హరిమయము విశ్వమంతయు
హరివిశ్వమయుండు సంశయము బలిలేదా
హరిమయము గానివస్తువు
పరమాణువు లేదు వంశపావనవింటే.

అని యేను మున్ను వచియించియుంటి నదిగావున నీవీచరాచరప్రపంచంబునంతయు హరిమయముగా భావించి సేవించుచుంటివేని సర్వబంధవిముక్తుండవై యుండెదవు వత్సా.

బలి—చిత్తము మహాప్రసాదము నేనట్లనే భావించి సేవించుచుందును.

ప్రహ్లాదుడు—(చేతులు జోడించుకొని భయభక్తులతో వామనుం జూచి) మహాత్మా!

ద్విపద.

ఇతనికి మున్ను నీవింద్రత్వ మొసగి యతులితగతి నిప్పుడదితి గర్భమున
పతితపావనమగు వటురూపమొంది సుతుడవై జన్మించి చోద్యంబుగాను
కులుకుచునిటువచ్చి కోరియాచించి యలరారు తద్రాజ్యమంతయుగొంటి
వదిమేలు మోహజాహంకృతిమూల మదగర్వజాత తామస వికారంబు
లడగించి రక్షించి తంతియకాని కడగి యీతనిబట్టి కట్టుటగాదు.
తత్వజ్ఞునకు మహేంద్రత్వమదేల సత్వగుణానీదు సన్నిధిజేరి
గొలుచుటబోలునే గోరాజ్యపరత కలిమి గలిగిన నెట్టి ఘనుసకునైన
కనులుగానగరావు గర్వమేపారు వీనులువినరావు వెడవెడబల్కు
చిత్తంబు స్వేచ్ఛమైచిక్కులువెట్టు మత్తుడై నీసేవ మరచునుదాన
మేలుజేసితినీదు మేరయుజూపి పాలించుమీపాటి పద్మాసమేత.

ఉత్సాహ. ధారవోసె నీమనోరథంబుచీర ధారుణిన్
నేరమేమి సల్పలేదు నీదు భక్తుడౌట చేన్
ధీరశాంతుడవుగదా సుధీ ధనార్తశారదా

సాాెసారెకుం గృపారసంబుజల్లు వామనా!
యీపాపుని హృదయంబుదీపింప దయార్ధ్రసవీక్షల నీక్షించి పాశ
విముక్తుంజేయుము—

వామనుడు—(ప్రహ్లాదుంజూచి) సకలలోకాహ్లాదా! ప్రహ్లాదా! నీపరమ
భక్తివిశేషంబును సత్వగుణసంపన్నతయును మున్న యేనెఱుం
గుదు నందుకు తదనుగుణంబుగనే వధించితివి నీవామనుడవులు
విని కడుసంతసించితిని నీమనుమ బ్రోవదలచియే యిటువచ్చితిని

చ. ఘనతర పుణ్యుడీబలి మఖంబులనెల్ల మదర్పణంబుగా
గొని యొనరించుచుండెనని కోరికతో నిటువచ్చినాడ నీ
దనుజుని సత్యధర్మములు తద్దయుజూతమటంచు బొంకలే
దనఘుడు సత్యవంతుడు మహాత్ముడుముక్తుడుగాకబద్ధుడే!

యీతని దయాసత్యశౌచంబులకు సంతసించితిని భవబంధ ముక్తుం
డగు నీమహాత్మున కీవారుణపాశ బంధంబన నెంత ప్రహ్లాదా?
నాకటాక్షవీక్షణ మాత్రంబున నురిలిపోవును—

(అపుడు భయసంభ్రమములతో వామనుంజేరి)

వింధ్యావళి—(కృతాంజలియై) కందార్థము.

క. కాదనక సొమ్ములే దీ ♦ రాదనక జగత్రయైక రాజ్యమొసంగెన్
నాదయితు గట్టనేటికి ♦ శ్రీదయితా చిత్తచోర శ్రితమందారా.
బ్రోవగదే సం ♦ తత లోకాధారా ?

హితమతివగు నీకు హేలార్థమగులోక
వితతిజూచి యాకుచ్ఛితులే యీాసులమందు !
పతియునీవే జగములకు దిక్పతుల కెల్లనుగతియు నీవే
ధృతియునీవే మతియునీవే. నతులుగొని నా
పతిని బ్రోవుము ||శ్రితమందారా||

లక్ష్మీనాయకా నాప్రాణనాయకునిజేరి మూడడుగుల పుడమి నడుగు
నట్టి గుజ్జురూపంబు విడచి కపటుండవై ముజ్జగంబులు నిండి
యుండునప్పటి గొప్ప యడుగులగొలకొని నీవిట్లు విరోధించి

బాధింపనేలా? నీవట్లుసేయ మేలా. మద్విభుని పాశముక్తుం జేయుమా రమాలోలా ?

వామనుడు— వింధ్యావళీ ! నీవిటువినుము! అణోరణీయాన్ మహతో మహీయాన్ ! అను వేదవచనము నిక్కంబు సేయదలచియు నీప్రాణ వల్లభుండగు దైత్యవల్లభుని సత్యశీలాదులు బరిశీలించి ప్రకటింపదలచియూ! రేనిట్లు వచ్చితి నదియొక కాపట్యంబు వహించి సాధింపవచ్చితినని యెంచవలదు ! నీవును బతివ్రతా శిరోమణి వౌదువు. నీవాడునుడువులును యుక్తియుక్తంబులై యున్నవిగావున తత్పరమార్థంబు నీకెరింగించితిని అదియునుగాక.

క. నీదయితుడు బుణ్యాత్ముడు
నాదయకున్ బాత్రుడయ్యె ! నళినదళాక్షీ !
లేదనక నిడియె సర్వము
మోదించెనుదాత్మ మిమ్ముబ్రోచెద నెప్పుడున్ !

నీవిభుండు నాకృపావలోకనంబులచే నిమిషమాత్రంబున పాశబంధ విముక్తుండై యుండు నీవందుకు గుందు జెందవలదు.

వింధ్యావళి—చిత్తము చిత్తము మహాత్మా నిన్నే నమ్మియున్నారము.

(అంతట చతురాననుండు ప్రవేశించి వామనుంజూచి) కృతాంజలియై)

చతురాననుడు— ద్వి ప ద.

దేవ జగన్నాథ దేవాదిదేవ పావనచరిత యోపాపవినాశ
భూతలోకేశ్వర భువనాధినాథ భూతభావన నిత్యపుణ్య సంచార
దనుజేంద్రుడీతండు దాతృవరుండు తనసొమ్ము సకలంబుదప్పకనిచ్చె
దండయోగ్యుడుగాడు తగబ్రోవవలయు నండజవాహబంధార్హుండుగాడు
విడిపింపుమోతండ్రి వెరపింతమాన్పి కడువడిమీపాదకమలముగూర్చి
వారిజములను దూర్వములనుజూచి కోరిపూజించుభక్తుడు గానలేదు
నీవు ప్రత్యక్షమై నెలవుగావచ్చి వావిరివేడుచో భావించితనదు
రాజ్యమెల్లనొసంగె రాజీవనేత్ర పూజ్యుండు ఘనతరపుణ్యుడీతండు
తగదుబద్ధునిసేయ ధర్మాత్ముడితడు వగువనీయకకట్లు వదలింపుమయ్య

సకల గుణ సాంద్రుడగు నీ దానవేంద్రుని పాశబంధ విముక్తుం
జేయుము తండ్రీ !

వామనుడు—మంచిదట్లనే సేయుదును చతురాననా నీవిటువినుము—

ద్విపద.

ఎవ్వానిగరుణింప నిశ్చయించితినో మవ్వంబుగావాని మహితవిత్తంబు
సకలంబుహరియింతు సంతృప్తిగాను సకలజనంబులు సంసారమునను
బెనగొని మదయుక్తి విఱ్ఱవీగుచును ననుధిక్కరించుట నయమొందలేక
నిఖిలయోనులయందునిజముగాబుట్టి సుఖహీనదుర్గతిన్ జొచ్చుచుండెదరు
రూపింప ధనవయోరూపవిద్యాది చాపల్యములుమాని సన్నుతించుచును
విమలుడై యెవ్వడు వేడుకనొందు గ్రమముగావాడునాకరుణనుజెందు
విత్తాభిమాన సద్వైభవాదులందు మత్తుడై చెడడుగా మద్భక్తుడెపుడు
గురుశాపమునసిరి గోలుపోయినను గరిమతో నేనిట్లు గట్టివైచినను
విభవహీనుడుగాడు వెలవెలబోడు శుభచిహ్నములుమీఱె శుద్ధత్వమమరె
కరుణయుసత్యంబుగలదు మోమునను పరమపుణ్యుడితండు బద్ధుడుగాడు
తనసొమ్ముసకలంబు దప్పకనిచ్చె దనివిజెందిననేను దనుజేంద్రునెపుడు
గరుణించి రక్షింపగాంక్షించివాడ తరలును పాశబంధంబిదే వత్స

(అంతలో బలిచక్రవర్తికి వారుణపాశబంధంబు సడలిపోవుచున్నది.)

వామనుడు—(ప్రహ్లాదుం జూచి) కందార్థము—

క. సావర్ణిమనువు వేళను దేవేంద్రుం
డగు నితండు దేవతలకు సంభావితమగు నాకోటికి
రావించెదనంతమీద రక్షింతుదయనూ
నేనియ్యెడ వీక్షింతు కృపనూ.
అక్షయసంపదలలరారగా నిజ రక్షస్సంఘమునెల్ల రహిమీఱ నేలుచు
దక్షుడై సుతలాలయంబున దైత్యసేనలు గొలుచుచుండగ
బక్షపాతములేక యేలుచు భద్రముగ నటనుండబంచెద ॥రక్షింతు॥

ప్రహ్లాదుడు—(వామనుంగాంచి సవినయంబుగా)

సీ. చతురాననుడు నీప్రసాదంబుగానడు
శర్వాదీ లక్ష్ములజాడ బొంద

డన్యుఁడెక్కఁడదగు నన్యులకును మాకు
బ్రహ్మాది పూజిత పదుఁడవైన
దుర్లభుండవు నీవు దుర్గపాలుఁడవైతి
పద్మజాదులు భవత్పాదపద్మ
మకరందసేవన మహిమనె గౌరవంబు
లందిరి కాన మేమల్పమతుల

గీ. మధికదుర్బోధులము కుచ్ఛితాత్మకులము
నీకృపాదృష్టి మార్గంబునెలవు సేర !
నేమి తపమాచరించితి మెన్నఁగలమె
మమ్ముఁగాచుట చిత్రంబు మంగళాత్మా !

వామనుడు— అవునవును ప్రహ్లాదా? నిక్కమే వక్కాణించితివి! జ్ఞానమానసౌశీల్యాది గుణంబులు నీయందే వెలయుచున్నవిసుమా? కాబట్టియే పరమభాగవతులలో మున్నుగా నిన్నే గణించుచుండెదరు (అని బలిచక్రవర్తింజూచి)

కందార్థము.

వేమరునీ దాతృత్వమె నేమంబిడు నీకు నింద్రసేన మహారా
జామది వెరువకు మేలగు నామయరహితంబు సుతలమందుండదగునా
అచట సిరుల నొందెదు తగనూ ?
పొందుగ గదనుచేబూని యేప్రొద్దునీ ముందె నిలచియుందు ముద
మొంది రహిజెందు ||సంవు||
అందమగు నాదైన చక్రము నప్పటప్పటి కంపుచుండెద
మందులై నీపంపుసేయని మత్తవైరుల దునుము నిజముగ ||నందు||

మదాజ్ఞానుసారంబుగా నీవునీవారలంగూడి సుఖంబుగా వసింపుము. నే సదా గదాపాణినై మిమ్ముఁ గాపాడుచుండెదను దానవేంద్రా !

బలి— చిత్తము చిత్తము! మహాప్రసాదము మహాత్మా !

ఉ. ఎన్నడు లోకపాలకుల నీకృపజూడని నీవు నేడు న
న్నున్నతిజేసి నాబ్రతుకునో జయునానతి యిచ్చి కాచితీ.
మన్ననలున్ దయారసము మాటల పెద్దఱికంబు జాలదే
పన్నగతల్ప నిన్నెరుగుపట్టున నాపదగల్గ నేర్చునే

వామనుడు—నిజము నిజము యదార్థమే వచించితివి (అని ప్రహ్లాదుం బిలిచి)

గీ. వత్స ప్రహ్లాద? మేలు నీవారు నీవు
సారథి మనుమని దోడ్కొని సుతలమునకు
బయనమై పొందు నేగదాపాణినగుచు
జేరిరక్షింతు దురితంబు జెందదచట

ప్రహ్లాదుడు—

ఆ.వె. సర్వగతుడవయ్యు సమదర్శనుడవయ్యు
నొకట విషమవృత్తి నుండుదరయ
నిచ్ఛలేనివారికీవు భక్తులు గోరు
తలపులిత్తు కల్పతరువు మాట్కి.

దేవదేవా! మహానుభావా! శెలవుశెలవు మీయనుజ్ఞ ప్రకారము సుతలంబునకేగి యచ్చట సుఖంబుండెదము మమ్ము రక్షింపుము రక్షింపుము.

వామ—మంచిది! దానవోత్తములారా? సకల శుభంబులు గలుగునట్లు నేసదా గదాపాణినై రక్షించెదను, జనుండు.

(అపుడు వింధ్యావళీసహితుండగు బలిని దోడ్కొని ప్రహ్లాదుం డంతఃపురమునకు వెళ్ళుచున్నాడు)

వామ—(ఎదురుగా వచ్చుచున్న శుక్రాచార్యుంజూచి)
దనుజలోక సంభావ్యా! కావ్యా!

విదూషకుడు—యికనేమి కావ్యుడు మాఆచార్యులుగారికి చావుదప్పి కన్ను లొట్టపడినది.

శుక్రా—అపరాధినపరాధిని యేమి శెలవు సుధీజనావనా! వామనా!

వామ—అపరాధమున కేమున్నది, పారమార్థిక విశేషంబు లెరింగి యునూ! వ్యావహారిక ధర్మంబు లుపదేశించి బలిని మరలింప జూచితివి. అట్లు బోధించుటను చితంబుగాదుగాని క్రియమాత్ర మట్లు జరిగినదిగాదు దానికేమిగాని.

చ. దనుజుడొనర్చు యాగమున తద్దయు నేమికొరంతయయ్యెనో?
కనుగొని పూర్తిజేయుమిక కావ్య! జనస్తవనీయ కావ్య! యెం
దును విషమంబుబొందినను దోరపుగర్మ సమూహమెల్ల స
జ్జనులగు భూసురుల్ గనిన శాంతినొసంగునటంద్రు కోవిదుల్.

శుక్రుడు— ద్విపద.

అఖిలకర్మంబుల కాధ్యుండవీవ నిఖిల యజ్ఞాత్మక నీవిటువచ్చి
బడసితి సంతుష్టి బాగుగానిపుడు కడుమేలుగల్గునే కర్మంబులకును
ధనదేశ కాలార్హ తంత్రమంత్రములు నినుబేర్కొనంగనే నెరవేరుచుండు
నైనగావింతు నీయానతిబూని దానవసవనంబు తరువాయినెల్ల
మునులు సాహాయ్యంబు మొనసిసేయగను ఘనముగా నేనట్టి కడను
దీర్చెదను
శ్రీరమానాథ నేజేసితిత్రప్పు నేరమెంచకను మన్నించుము నన్ను.
మహితుండవైన నీమహిమెరింగియును యిహలోకధర్మంబు లేవచించితిని
తెలిసిచెప్పకయుంటి ధీయుక్తిగాదు దెలుపనేలను నీకు దెలియనిదెద్ది
సర్వజ్ఞ సర్వేశ సర్వాంతరాత్మ! సర్వంబు శుభమగు జనివత్తు నేను!

చిత్తము! దేవా! తమశెలవుప్రకార మాలాగుననే యజ్ఞశేషంబు పూర్తిసేయించి బలిదైత్య ముఖ్యులనెల్ల రసా సుతలంబునకు బంపెదను (అని చండామార్కులతోగూడి వెళ్ళును)

(అంతట చతురాననుండు వామనుంజూచి)

చతురాననుడు—తండ్రీ నీతలంచిన తలంపు సఫలంబైనది కావున.

గీ. చక్కఁగ శచీపురందర సహితులగుచు
నఖిల దిక్పాలకాదిసురాళితోడ
గూడుకొని నీదురాకను గోరుచుండు
నదిటికస్యపులను జేర నరుగుమిపుడు!

వామ—మంచి దాలాగుననే మన మమరావతీ పట్టణంబునకు వెళ్ళి వత్తము నీవుగూడ రమ్ము. వత్సా చతురాననా! నాతో గూడ రమ్ము!

(అని ప్రబుద్ధ మేధావులను గురుశిష్యులం దోడ్కొని చతురాస్యునితో వెళ్లుచున్నాడు.

ఇ ది

పంచమాంకము

సంపూర్ణము.



# మహేంద్ర విజయము



## షష్టాంకము ప్రారంభము

"శచీపురందరాది సమేతులగు నదితి కశ్యపులు ప్రవేశించి, సముచితాసనంబులం గూర్చున్న పిమ్మట"

క. వామనునిరాక గోరుచు
మామకలోచనములిపుడు మల్లడిగొనె నా
సోమునిరాకను మదిలో
గామించు చకోరకములకైవడి నాథా!

మనముద్దుల పొట్టివడుగు బలి మఖవాటినుండి వచ్చుటకు దా నింత తడవుగావించె నేలొం? ప్రాణనాథా! అతనికోరిక నెరవేరి యుండునేకదా? మనోరథంబు సఫలంబైనచో నిల్లల జాగు సేయును—

కశ్యపుడు—(ఆమాటవిని)

క. లలనా! సందియమొందగ
వలెనా? మాకపటవటుడు పటు చతురతతో
బలిదనుజుని వంచించెయొ
విలసిత సంపదలు దెచ్చు వేగమెవచ్చున్.

ఆమాయావాదన పటుండెట్టులైన మన సురరాజ్య వైభవంబుగొని తెచ్చును గాని యూరక వచ్చునా? కుందరదనా? నీవెందుకు సందేహంబు నొందెదవు!

(అంతలో బ్రహ్మాది భూసురులతో వామనుండు ప్రవేశించుచున్నాడు)
(అదితికశ్యపు లిద్దరును యెదురుగావెళ్ళి)

అదితి—నా చిన్నికుమారా? వచ్చితివా?

కశ్యపుడు—నా ముద్దులయ్యా! వచ్చితివా! (అని కౌగలించుకొనుచున్నాడు.)

వామ—జననీ జనకులారా! నా నమస్కారంబులు గ్రహింపుడు (అని తలిదండ్రులకు నమస్కరించును)

అదితికశ్యపులు—చిరంజీవ! చిరంజీవ! సుఖీభవ! సుఖీభవ!

కశ్యపుడు-చ. శుభమె కుమారనీకు పరిశోభితమా బలియాగవాటికా
సభను జయంబుగొంటివె వెసంబలిదానవుజేరి కోరిత
ద్విభవమునెల్లగొల్లగను వేడుకతోడ గ్రహించి తెచ్చితే
సభయులకీశచీంద్రులకుసయ్యనియ్యగవచ్చితేయిటుల్.

నా చిన్నివడుగా! వామనా? క్షేమముగా జనివచ్చితివే! సురరాజ్య వైభవముగొని తెచ్చితివే కుమారా!

వామనుడు—(మందహాసము జేయుచు) జనకా సకలలోకానంద జనకా?

ఉ. వచ్చితి భావుకంబుగను వాటముగా బలియజ్ఞవాటికన్
జొచ్చితి తత్సభాసదులు సొంపుగనన్గని ముచ్చటింపగా
మెచ్చితి దైత్యనాయకుని మేలుగగోరి సురేంద్రసంపదన్
దెచ్చితి మీయమోఘమగు దీవనలన్‌గొని యిట్లు వచ్చితిన్!

కపటయాచన గావించి మూడడుగుల పుడమి నడిగి భూదానంబుగొని బలినిబంధించి యింద్రవైభవము గొనివచ్చితినయ్యగారూ?

కశ్యపుడు—మంచిది కుమారా?

అదితి—(వామనుని చెంతజేర్చుకొని) చెక్కిలినొక్కి ముద్దుబెట్టుకొని) నా చిట్టిపట్టీ నానోము పంటా?

గీ. సిరులు గైకొని వచ్చితే చిన్నివడుగ
బన్నములు బాపితే మము గన్నతండ్రి!
బలిని వంచించి తెచ్చితే వైభవంబు
మేలుగై కొంటిమి కుమార మేరుధీర!

నానోముపంటా! నీదంటతనంబు నెరపి సురారినడిగి సిరులుగొని తెచ్చితివే! చిన్నికుమారా? మానోచిన నోములన్నియు నేడు



ఫలించినవిగదా? శుభదాయకా?

వామనుడు — జననీ! త్రిభువనానంద జననీ!

గీ. సవనమొనరించు యాబలిచక్రవర్తి
దరికి జనినాడు చతురత తనివిదీర
నతని నుతియించి పుడమి మూడడుగులడిగి
భూమిదానము గైకొంటి ముదముతోడ

అట్లు గైకొని పిమ్మటను —

చ. మరియును మూడుపాదముల భూమినిదానమొసంగునంతె స
త్వరముగ దైత్యనాయకుని వంచనసేయ మతిన్ద్రివిక్రమ
స్ఫురణను రెండుపాదముల భూతలమున్ దివమున్గ్రహించి యా
కొరవడునట్టిపాదమునకున్ బలిసంపదగొంటిదంటనై.

ముముగన్నతల్లీ! సుగుణసంతానవల్లీ! మీబన్నంబులుబాపుటకై నేనెన్నియోమాయలుబన్ని పన్నుగా నన్నిలింపసంపదంగొనివచ్చితి నిక మాయన్నయగు నింద్రుని స్వారాజ్యసంపన్నునిగా సేయుదును.

అదితి — "సానందంబుగా" అటులనా నాముద్దులచిట్టిపట్టీ మాయిదుము లడచుటకై నీవావడువుగ గడుసునుడువులు నోడివి మూడడుగులపుడమినడిగి గురుచవై యుండు నీవు మిగులపొడవై త్రిలోకాధిపత్యంబు పదత్రియంబునబుచ్చికొనివచ్చితివే చిన్నివడుగా అహా! యేమియాశ్చర్యముగానున్నది! నీయడుగులకు మడుగులొగ్గవలసినదేగదా వామనా! వినుము.

కం. బలినడచి సిరులుదెచ్చితి బలవైరికిమేలొనర్చి బరగితివిభళీ!
బలవంతుడైనతమ్ముడు గలిగిననగ్రజుడు శుభముగైకొనుటరుదే.

కావున నది యొక యబ్బురముగాదు.

వామనుడు — అంబా! సకలగుణావలంబా! మజ్జననీజనకులగు మీ వధూవరుల తపఃప్రభావమే యీలీల శుభపరంపరలుగా బరిణమించుచున్నది. అందుకుసందేహమేమున్నది నా శక్తి యుక్తులన నెంత! "అని మహేంద్రునిజూచి"

చ. బలిమినినిన్ద్రివిష్టపము బాయగజేసి ప్రభుత్వమొందునా
బలినిపదత్రయావనిని వ్యాజముగా గనుగొని రాజ్యమున్

వలనుగదెచ్చినాడనిదె వాసవ! నీవిక వాసిమీఱగా
బలుసిరులన్ దివిష్టపము పాలనసేయుము హాయిమీరగాన్.

అగ్రజా! మరల నింతటినుండి తొల్లింటిలీల నాసామ్రాజ్యసామ్రాజ్యంబు నేలుచు సర్వసుపర్వపరిపాలనంబు నీవకావించుచుండుము.

"అని యెదురుజూచి"

ఇదిగో మన కులగురుండగు గురుండును వచ్చుచునేయున్నాడు.

"అంతలో బృహస్పతి ప్రవేశించి—వామనుంజూచి"

బృహస్పతి—వాసుదేవా! మహానుభావా! పూజ్యతమంబగు సురరాజ్యంబు గొనివచ్చితివే మహాత్మా! మరల నీయగ్రజునకు త్రిలోకాధిపత్యంబు దయచేసి పట్టంబుగట్టింతువే!

వామనుడు—చిత్రము చిత్రము గురూత్తమా! యిది యంతయు మీయాశీర్వచనవిశేషమే. అటులనేకొనివచ్చితి యీదివ్యముహూర్తంబున మదగ్రజుండగు నిందునకీస్వారాజ్యంబు పట్టాభిషేకంబు గావింపుడు.

"అని తనచేతనున్న పూలమాలికలుదీసి శచీపురందరుల కిరువురకును మెడనువైచి గురునితోగూడ ఝారీచెంబుతో వారిధారలు వారి శిరముల జిలుకుచు పట్టాభిషేకంబు గావించుచున్నాడు.

బృహస్పతి—"శచీపురందరులపై నక్షతలు జల్లుచు"

శచీపురందరులారా! మీకు శుభంబులగుగాక! సిరులు వెలయుగాత!

"అని యింద్రునింజూచి"

దెబ్బనిమీఱ దమ్ముకంటియగు మీతమ్మునివలన మరల నీత్రివిష్టపంబునకు పట్టాభిషిక్తుండవైతివి—అడగాపున నీవిది మొదలుకొని శచీసమేతంబుగా—

గీ. సిరులుసంతతులలరార జెల్వుమీఱ
నాయురారోగ్యభాగ్యంబు లతిశయింప
నెలమిమీరగ స్వారాజ్య మేలుకొనుము
త్రిభువనశోభితుండవై విబుధేంద్ర సుగుణసాంద్ర.

నిష్కటంకంబగు నీతివిష్టపంబును నీదంటతనంబున నాచంద్రార్కంబుగా నేలుకొనుము.

ఇంద్రుడు—చిత్తముగురూత్తమా! యీ మహావైభవంబున కెంతయు మీ యాశీర్వచనరచనా విధానమే ప్రధానమైనది! మహాత్మా!

ప్రబుద్ధుడు—తథాస్తుతథాస్తు! సర్వగీర్వాణమనోరథాఃసఫలాఃఅభూవన్.

మేధావి—యింతకన్న మనమనవలసినదేమున్నదీ అదుగోఅంతా ఆహా దేవదుందుభులు తమకు దామే మ్రోయుచు వినువారి వీనులకు విందు సేయుచున్నవి వింటివా!

ప్రబు—ఆపారిజాతంబులగు పారిజాతంబులును స్వయముగా విరుల వానలు గురియుచు గనువారల కనులపండువ సేయుచున్నవి. చూడుము.

మేధావి—ప్రబుద్ధా! యెల్లవారికి వేడుక మూడ సేయుచు నేడు దానెంతయు సుదినమై వెలయుచున్నది.

ప్రబుద్ధుడు—అవునౌను యీసురేంద్రపట్టాభిషేకమహోత్సవము సకల లోకానందకరంబై యట్లనే సేయుచున్నది.

"అది విని"

బృహస్పతి—శిష్యులారా! వింటిరా!

చ. బలికడకేగి వామనుడు వంచనజేసి త్రిలోకరాజ్యమున్
బలిమినిదెచ్చియిచ్చుటను భాసురలీల వహించి కొమ్మరన్
బలరిపుడిప్పుడిట్టిఘన వైభవమున్ గొని యుండెమెండుగాన్
గలిమినెసంగుత్తమ్ములిటు గల్గగనన్నలు మేళులొండరే!

ప్రబుద్ధుడు—నిక్కము గురూత్తమా! యీ యింద్రుని మహాభాగ్యమట్టిదే.

మేధావి—ప్రబుద్ధా వినుము.

కం. బలిమియు కలిమియు చెలిమియు
గలలును పటుశౌర్యధైర్య గాంభీర్యాదుల్
గలహరిలేన సోదరుడై
కొలువగనింద్రునకునేమి కొదువగు చెప్పుమా.

ప్రబుద్ధుడు—అవునవును ఆమాట నిజమే! అనంతకళ్యాణగుణ సంప
న్నుండగు హరి తన కనుజుడై యలరుచుండు సురరాజు సిరుల
బడయుటదెంతవింతనిజము నీవాడుమాట పాటిగానేయున్నది.

బృహస్పతి—శిష్యులారా! మనమిప్పటికి శెలవుబుచ్చుకొని యిళ్ళకు
వెళ్ళి కాలార్హవిధులు దీర్చుకొనివత్తమురండు.
"అని వెళ్లుచున్నారు."
"తరువాత యిందుద్రుడు వామనునింగని సవినయుంబుగా"

ఇంద్రుడు—చ. బలివలనంజయింపబడి వంతలనొందెడు మమ్ము బ్రోవగా
వలచివటుండవై గపట వామనరూపముతోడనేగి యా
బలిదనుజేంద్రుడై భవము భాసురలీల గ్రహించి తెచ్చిజె
న్నలరగ నన్ను బూర్వవిభవాన్వితుజేసితి నేడు తమ్ముడా.

నీవంటి బలపరాక్రమాదులును ఆదరాతిశయంబులును గల
సోదరులుగల ధన్యాత్మునకేమి మేళ్లు లొదవకుండును! త్రివి
క్రమా? మాభాగ్యవశంబున జగదీశ్వరుడవగు నీవిట్టి పొట్టి
వడుగు వడువున నాతోబుట్టువై పుట్టి బెట్టిదంబులగు నాపదలు
బాపి సంపదలు బెంపుజేసితివిగదా మహాత్మా!

శచీదేవి—నమ్రతగా వామనుంజేరి యంజలిపట్టి
క. రక్కసులు రాజ్యమేలగ
వెక్కడుములనొంది కుంది పేదరికముతో
నిక్కట్లకు లోనై కడు
బొక్కెడు మముగరుణజూచి బ్రోచితివి హరీ!

మరల సిరుల నొనగూర్చి మాయుల్లంబులు బల్లవింపజేసితివి
గదా? రమావల్లభా! అందువలన నిపుడు.
సీ. భర్మనిర్మితములౌ హర్మ్యాంతరంబుల
వసియించి యుండెడు భాగ్యమబ్బె!
మందారతరులతో నందమౌనందన
వనమందు విహరించు భాగ్యమబ్బె!

పతిచెంతనుండి రంభాదికాంతల నాట్య
వైభవంబులు జూచు భాగ్యమబ్బె!
గరుడ గంధర్వకిన్నర సురాంగనలు
సంభావించి సేవించు భాగ్యమబ్బె!
గీ. సిరులు గోల్పోయి వనముల దిరుగుచుండు
మాకు స్వారాజ్య పట్టాభిషేకమిపుడు
మరల నొనగూర్చుటనుజేసి మహితచరిత
సన్నుతములైన నీచర్య లెన్ననరిది,
చెన్నుమీరెడు మాముద్దు చిన్నిమరిది—
నీలీల లేమని వినుతింతును—
యింద్రుడు—మరల సహర్షంబుగా?
సీ. అసురులు గొంపోవు యాగభాగంబులు
గరిమతో గైకొన గల్గె నేడు
దిక్పాలకులతోడ దివ్య సుధర్మయం
దెలమి వసింపగా గలిగె నేడు!
తుంబురు నారదుల్ తోరంబుగాసేయు
గానముల్ వినుచుండగలిగె నేడు
రంభాదికాంతల రహిమీరు లాస్య లీ
లలనెంచి చూడగా గలిగెనేడు
గీ. యలపులోమజతోగూడి మెలగగలిగె
భాగ్యభోగ్యంబులన్నియు బడయగలిగె
సిరుల నలరించు నీదయచేతనేడు
ఆదినే యాదరుండ సహోదరుండ!

వామనుడు—(చిరునవ్వు నవ్వుకొని) మన జననీజనకులగు నదితికశ్యపు లొనర్చు తపఃప్రభావంబు వలనగాదే! తలచిన తలంపులన్నియును సానుకూల్యంబులై సఫలంబు లగుచుండును. తపశ్శక్తికసాధ్యంబులగు కార్యంబు లున్నవే! అగ్రజా నన్ను సన్నుతింప నేలా?

ఇంద్రుడు—అవునౌను. ఆమాటనిజమే త్రిజగతీ పతివగు నిన్ను సుతునిగా గన్నవారి తపోమహాత్మ్య మెంతని వినుతింతును (అంతట యీశానుడు ప్రవేశించి)

ఈశానుడు—ఆహా యేమిదీ మీమహాభాగ్యము. అదితికశ్యపులారా! మీతపోమహిమ నేమని వర్ణింతును! మజ్జగంబులనేలు వేలుపు గుజ్జురూపంబున మీపజ్జ నిట్లు జెరించుచుండ మీకేమి కొదువ మీయిడుము లెడవాపి కటువడిగా ! సిరుల నొడగూర్చెను. మీకోరికలు నెరవేరినవి కదా !

అదితి కశ్యపులు—శర్వాణీ మనోహరా ? దీనికంతయూ ! మీకృపావిశేషమే మూలముగదా ? సర్వమంగళా వల్లభా !

ఈశానుడు—(బ్రహ్మను జూచి) వాణీమనోహరా ? వింటివా ?

ఆ.వె. బల్లిదంపుఁదోడు ప్రాపున నింద్రుని
కిందఁ బదముజేరు టిట్లుగలిగె
తనకు నాథ్యుడైన తమ్ముడు గలిగిన
గోర్కులన్న కేల గొరతనొందు.

బ్రహ్మ—శంకరా ! నిజము నిజము !

కం. బలి సిరులను బలిమినిగొని
బలవైరికిదెచ్చి యిచ్చె వామనుడెలమిన్
బలవంతుడైన తమ్ముడు
గలిగినచో నన్నశుభము గైకొనుటరుదే!

అదియునుంగాక !

క. పాలడుగడు మేలడుగం
డేలడు బిక్షించి యన్నకిచ్చె ద్రిజగముల్
వేలుపులతల్లి కడపటి
చూలుంబోలంగ గలరె సొలయని తమ్ముల్.

ఈశానుడు—అవునౌను చతురాననా! యిట్టి వరసోదరుని బడయునట్టి మహాభాగ్యము— మన సురేంద్రునకు దక్క తక్కనవారికి లభించునే !

బ్రహ్మ—నిజము నిజము మహాదేవా! యిట్టి మహిమగల దిట్టరి తన పట్టియై పుట్టుట కావేల్పులతల్లి దానేమి నోములు నోచి కొన్నదో గదా !

ఈశానుడు—అనౌనౌను నదియాతయు నదితికస్యపుల మహాభాగ్యమే వీరి కెవ్వారీడగుదురు! భారతీపతీ !

గీ. కడుపు బరువుగాగ కొడుకుల గనుకంటె
తల్లి కొకడెచాలు బల్లిదుండు !
త్రిదశ గణముగన్న యదితి కానుపుదీర్చి
చిన్న మేటివడుగు గన్నయట్లు !

అసమర్థులగు బుత్రుల పెక్కండ్రఁ గను వారికన్న సమర్థు నొక్కని గను వారలైనను వన్నెకెక్కక మానరుగదా! వారిజాసనా?

బ్రహ్మ—నిక్కమే సక్కాఁశోచితివి వందుకు సందేహ మేమున్నది ! సర్వమంగళాధీశ్వరా ! వినుము ! వినుము !

సీ. ఇడుములు బడియుండు నింద్రునకీ వేళ
స్వారాజ్య మొసగిన సారకీర్తి
ఆపదఁ గొనియుండు నాదిత్యులకు నేడు
సంపద లొసగిన చక్రవర్తి
ఖేదంబుగొనిన శచీదేవికియ్యెడ
మోదంబొసంగిన పుణ్యమూర్తి
ఆధిని దొలగించి యదితికస్యపులకు
నానంద మొసగిన జ్ఞానపూర్తి !
గీ. చింతనొంది చరించు! జయంతముఖుల
కెంతయును సంతస మొసంగ నిటునటించు
భూరిగుణమూర్తి వామనమూర్తి నితని
గని కనిరి కీర్తి నదితియు కస్యపుడును.

ఈశానుడు—అవునౌనందుకు సంశయమేమున్నది! (అని వామను నవలోకించి మహాత్మా)!

సీ. అడవిపాలగు నమరాళి కిద్దమరా
వతీ పట్టణంబున దిరుగగలిగె
మూలలఁ దాగు దిక్పాలుర కిమ్మెడ
నింపుగా దిశలు పాలింపగలిగె
గిరిగహ్వరంబులన్ దిరుగు నింద్రున
కిప్డు నిండు సుధర్మయందుండ గలిగె
నదిప్రపంచలనుండు నింద్రాగ్నికిమ్మెడ
గలిమిగ్రై కొని యింట మెలగగలిగె !

గీ. శబరులనుగూడి వనినుండు శక్రసుతున
కందమగు నందనోద్యాన మందునేడు
సఖులతోఁగూడి విహరించు సుఖముగలిగె
వామనా! నీదు సత్కృపా వైభవమున.

తొల్లింటిలీల దులలేని సిరులతో దులదూగుచుండు గొడుకులఁ గోడం
డ్రను మనుమలంగని యానందించు మహాభాగ్యమీ యదితి
కస్యపులకు మరల గలుగజేసితివిగదా రమారమణా.

వామ—అమోఘ సంకల్పులగు మీమీమనోరథంబు లెట్లు ఫలింప
కుండును శంకరా! మీ కటాక్షవీక్షణంబులే యెల్ల శిరులకు
హేతువులై వెలయుచున్నవి. ఇంత మాత్రంబునకు నన్నొక
గొప్పగా జెప్పనేల?

యముడు—(వామనునిగని వినయంబు జూపుచు కృతాంజలియై)

(దోదకవృత్తము)

సర్వసు పర్వులకీయెడ నెంతయు । సంతసమున్ ఘటియించుటకై
ఖర్వుడవై బలిదానవనాథుని । గర్వమణంచి సిరుల్ గొననే
యుర్విని, దానముగాగొని పిమ్మట । నున్నతిగై కొనినాడ వహో!
శర్వముఖామర సన్నుత, హాకిక । సౌఖ్యముగల్గెను నీకృపచేన్.

వామనా! తొల్లింటి లీల మేమెల్ల సౌఖ్యంబులు నిపుడు వడయుచుం
టిమిగదా? దేవా!

వామనుడు — మీమీ కోరికలన్నియు నెరవేరుటంజేసి మీకందరకును నేడు మెండుగా పండువై యుండెగదా దండధరా ?

ఇంద్రుడు — చిత్తము చిత్తము — నీకటాక్షము గాదా? దేవా?

వరుణుడు — (వామనుంగాంచి) రమారమణా!

లయగ్రాహి

దానవునిగోరి యిలదానముగబూనియు బ్రితారణమొనర్చితె యుదార తసలీలా !
వానిసిరులెల్లగొనివచ్చి యిటులిచ్చమెయివాసవునికిచ్చితివిబాగునతలోలా
దీనమగుసౌరగణమార యిపుడెంతయుసుధీరతనుమీఱి మనుదీనపరిపాలా
మానిహృదయాబ్జముల మానుగ వసించునిను మాటికి నుతింప బరమా సుగుణజాలా

నీమహామహిమ లెన్నెన్నియో? యున్నవి అవి యన్నియు నెన్ని వర్ణింప నేనెంతవాడను మహాత్మా! నన్ను మన్నించుము.

వామనుడు — నేటికి మీయభీష్టములన్నియు సిద్ధించినవిగదా? పాశహస్తా?

వరుణుడు — చిత్తము దేవరవారి కృపాయత్తమే !

కుబేరుడు — (వామనుంజూచి) యిందిరా మనోహరా !

మత్తకోకిల.

దేవతావళినేల నీవిటు దీక్షబూని దయామతిన్
పావనాకృతి కశ్యపులకుంబుట్టివై కడుదిట్టవై
వావిరింబలి సంపదల్ గొనివచ్చి యిచ్చితి వస్నకున్
భావుకంబుగ మమ్ము నేలితి పావనాత్మక వామనా !

నీకటాక్ష వీక్షణంబులచే నక్షయ సంపదలొంది వెలయుచుండు నీసహాస్రాక్షుడు మరల మాకిపు డక్షిసాఫల్యంబు సేయుచుండెను గదా ! లక్ష్మీనాయకా !

వామనుడు — పరశ్రీయస్పృహానంబుగల మీమీతలంపులన్నియు నిట్లు పరిణమించి ఫలించినవిగదా కుబేరా ? మీకోరిక దీరినదిగదా

కుబేరుడు — చిత్తము చిత్తము దేవరవారి కటాక్షముచే నంతయు జయము గల్గుచున్నది.

(అంత కుమారస్వామి ప్రవేశించి దోసిలిబట్టి నిలుచుండును)

వామ__ఏమికుమారా! శుభాగమనమేగదా కుశలంబుగానుంటివా?

కుమా__చిత్తము_మా క్షేమంబు మీ కృపాయత్తమైయున్నది. బల
పరాక్రమక్రమా త్రివిక్రమా! నీవిటులనుము-విన్నవించెదను.

చ|| అని మును వెన్కముందును మహాభయలీలను దేవసైన్యమున్
దనరగజూచు నేను బలిదైత్యుడు దాడియొనర్చునప్పుడా
యని మొనవెన్కముందును మహాభయలీలనె చూచుచుంటి న
ద్దనుజునడంచి మాకిక ముదంబొనరించితివీవు వామనా!

వామ__కుమారా? యేమిది! నీవచన రచనాచాతుర్యమెంతచమత్కా
రముగానున్నది!

ఉ|| ధీరతమైస్వభావమున దేవబలంబుల నెల్లతీరుగా
బోరులమూడుమోములను ముందును వెన్కకు మూడుమోములన్
నారకజూచునీవు బలివంచితులై పరతెంచు సేనలం
దూరక వెన్కముందు గనుచుంటివె! భీతుండవైనడానా.

షణ్ముఖుండవగుటచే స్వభావంబుగా వెన్కముందు జూచుటయేగాక
బలిపరిబలి గ్రమ్ముకొని వచ్చునపుడు మహాభీతిచే వెన్కముందు
జూచుచు నూరకుంటివని కాబోలు నీతాత్పర్యము. అదినిజమే.
ఆబలి బలపరాక్రమానులట్టివే కావుననే

గీ|| అపుడు దానవబలముల కదరిబెదరి
పరువులిడుచుండు సురలను మరలుమనక
శక్తిసహితుండవైయుండు షణ్ముఖుండ
వీవె గనుచుండ సురసైన్యమేమిసేయు!

విదూషకుడు__దేవా అపుడు వీరి శక్తియుక్తులేమియు వినియోగించి
దినవికావుగదా!

కుమార__వాసుదేవా! మహానుభావా! సభయులమగు మాకు నీ
విపుడభయమొసంగితివిగావున నాశక్తి దనుజసైన్యహననాను
రక్తియై యిక వెలయుచుండును.

(అని ఆరుముఖములతో నొక్కమారుగా నిట్లునుతించును)

ఆరభిరాగము.—రూపకతాళము.

1. భయహరణా । భయహరణా । భయహరణా ।
భయహరణా । భయహరణా । భయహరణా ।

2. నయశరణా । నయశరణా । నయశరణా ।
నయశరణా । నయశరణా । నయశరణా ।

3. దయగనవే । దయగనవే । దయగనవే ।
దయగనవే । దయగనవే । దయగనవే ।

4. జయశుభదా। జయశుభదా। జయశుభదా
జయశుభదా। జయశుభదా। జయశుభదా

గీ॥ సంపదల పెంపునింపును సొంపుదొరగి
వెరవుగానక దీనుడై తిరుగుచుండు
సురలమరలను సిరులచే బరుగునటుల
కరుణనేలితివియ్యెడఁ పరమపురుష!

వామ—కుమారా! నీవిటువినుము.

ఉ॥ దక్షునకాత్మజాతయగు । తావకమాత దయాసమేతయై
యక్షయమౌ సిరుల్గొనుమ । టంచును దీవనలిచ్చి మున్నుగా
బిక్షయొసంగె సంపదలఁ । బెంపగునామె కటాక్షవీక్షచే
నాక్షణమందె కల్గె మన । మందఱమొందితి మోహడానవా!

భక్తజన కల్పవల్లియగు మీతల్లిగారియాశీర్వచనరచనావిశేషమేమనకిట్టి కలిమిగలిగించినది. (అనిఆదిశక్తియగు శ్రీశాంకరినిస్మరించుకొని)

ఉ॥ ఆదిమశక్తి శంకరుని । యర్ధశరీరము నవ్వహించు ము
జ్జైనుమ మంచు గుబ్బలికి । నాత్మజ షణ్ముఖుగన్నతల్లి బ్రి
హ్మాది సమస్తదేవత సమర్చిత పాదసరోజ యుగ్మ య
త్యాదరలీల శాంకరి దయాగరిమన్ మముబ్రోచుగావుతన్.

కుమారా ఆమె కటాక్షవీక్షలకు పాత్రులగు వారలకే యెల్లకోరికలు ఫలించుచుండును. ఆసర్వమంగళను స్మరించు వారలకన్నిటను జయమే గలుగుచుండునుసుమా!

కుమా—అవునౌను అల్లుభావించుటంజేసియే మీ యనల్పంబగు సంక
ల్పంబు బాల్పుగా సిద్ధించినది. మరియు మామనోరథంబులు
సఫలంబులైనవి—(అంతట బ్రహ్మ శంకరునవలోకించి)

బ్రహ్మ—శంకరా! భక్తమానస వశంకరా! యిట్లువినుము. ధన్యులగు
నీయదితికశ్యపుల కానందంబుగావింప నందనుండై జనించిన
భక్తచందనుండగు నీవామనుండు నెల్లలోకంబులకును లోక
పాలురకును ధర్మార్థకామమోక్షంబులకును వల్లభుండని యీ
మహాసభను నీవు నిర్ణయించి పలుకుము.

శంక—మేలుమేలు! భారతీపతీ! చక్కగా వక్కాణించితివి. గావున
నీవు చతురాననుండవే యగుదువు. (అని మరల) సభికులారా!
భృగుప్రముఖులైన మహామునులును దక్షులగు దక్షాది ప్రజా
పతులును, దేవ పితృదేవగణంబులును సురసిద్ధసాధ్య గరుడ
గంధర్వ కిన్నరకింపురుష నరవరేణ్య ప్రముఖులు విన నీదేవ
సభను ధర్మంబునకును యశంబునకును లక్ష్మికిని శుభంబులకును
శంఖచక్రంబులకును వేదంబులకును దేవతులకును స్వర్గాపవర్గం
బులకునుఁ యీ వామనుండె ప్రధానుండని చతురాననుండు
సంకల్పించెనందుకు మనమందరము సమ్మతింతుము. అదియునుం
గాక యీ సకలలోక రక్షామనుండగు వామనుండు యింద్రా
నుజుండై జనించెగాన యింతటినుండీతడు! ఉపేంద్రుడనుపేర
వాడబడుచుండుగాక మనమందఱమీమహాత్మునివలన సకల
శుభంబులు బడయుచుందుముగాక. సభ్యులారా వింటిరా.

కుమా—(అదివిని తండ్రినవలోకించి సకలలోకానందజనకా! జనకా!
మీరీసభను పలికిన పలుకులెల్ల సుధజిలుకుచు నెల్లవారల హృద
యంబుల బల్లవింపజేయుచున్నవి. మేమందఱమట్లనే యంగీక
రించితిమి.

వామ—(సహర్షంబుగా) మహామహులారా! మీరలందఱు నాయం
దలి వాత్సల్యంబునంజేసి మీయందఱిలో నన్నిట్లు గొప్పగాజేసి
నిర్ణయించితిరి నేనందుకు చాల సంతసించితిని. మఱియు మద

గ్రిజుండగు నింద్రుడు త్రిలోకపూజ్యసామ్రాజ్యంబు బాలిం
చుచుండగా! నుపేంద్రుడగు నేను యువరాజుగానుండి మోదుగా
దోడుపడుచుండుటకుగూడ సమ్మతించితిని.

బ్రహ్మ—బళీ ! యుపేంద్రా ! సకలగుణసాంద్రా ! బాగుగా వచించి
తివి. నీ యభిమతానుసారంబుగా నట్లనే పరిపాలించుచుందుము.

వామ.— (వారలందరంజూచి) బ్రహ్మాది ప్రముఖులారా! మీమీయ
భీష్టంబు లికయెవ్వియైన సఫలంబుగావింతుఁ గోరుకొనుడు.

బ్రహ్మ—మహాత్మా! మామనోరథంబులన్నియు సఫలంబులైనవిగాని,
చతురత మతానుసరణంబుగా నిన్నిపుడు వేడుకొందుము (అని)

ఉ॥ పారులు వేదశాస్త్ర పరిపాటినిఁ బూనగ మానవేశ్వరుల్
వారకసత్య ధర్మపరిపాలనసేయగ హాయిగాజనుల్
దోరపు భాగ్యభోగ్యములతో దులదూగగ మేటియుర్వరన్
వారిదముల్ యథార్థముగ వానలిడన్ వరమిమ్ము వామనా !

వామ—అటులనా. సరియే. మంచిది. యట్లనేయగుగాక !

ఉ॥ తేజమెలర్ప వేదవితతిన్ బఠియింతురుగాక భూసురుల్
రాజులు సత్యధర్మగతి రాజ్యమొనర్చుచు నుందురుగాక నెం
తోజయలీల వృష్టినలతోయదముల్ ఘటియించుగాక స
ద్బీజములున్ ఫలింపగను భూములుమెండుగ పండుగాక నీ
భూజనులెల్ల సంపదలుబొంది సుఖింతురుగాక యేకడన్.

సభ్యులారా! మీయభీష్టంబులెల్ల నట్లనేఫలించుగాత.

గీ॥ అవనినూతన పురవరాధ్యక్షుడధిక
భవ్యతరశీలుడాశ్రితభక్తలోక
పాలుడైనట్టి వేణుగోపాలుడెలమి
సఫలములుజేయు మీ యభీష్టములుపుత్ర !

బ్రహ్మ—చిత్తము మహాత్మా!

శంక—అదితికస్యపులారా ! మీరిక శచీపురందరాదిసహితులై
యుపేంద్ర పరిపాలితంబగు నమరావతి నమితసుఖంబులొందుచుందు
డుఁడు. మేమును మానిజనివాసంబులకేగివత్తుము. శెలవొసంగుడు.

అదితికశ్యపులు—చిత్తము. శంకరా! మీకృపాయత్తులమగు మమ్మనను గ్రహించుచుండుము.

శంక—(ఇంద్రునిజూచి) మహేంద్రా! శచీసమేతుండవై! జయంతాదులతో గూడ మీతల్లిదండ్రుల ననువర్తించుచు మహేంద్రను రక్షితంబగు నీ సుధర్మనధిష్ఠించి సద్ధర్మంబుగా సురపరిపాలంబు సేయుచుండుము. మేమేగివచ్చెదము.

ఇంద్రు—చిత్తము చిత్తము. శంకరా! నతవశంకరా! మీ యాజ్ఞానుసారంబుగా నటునే సేయుచుందును.

శంక—(వామనుంజూచి) ఉపేంద్రా! నీ వింద్రాది సురసహితుండవై మీతల్లిదండ్రుల సంభావించుచు భావుకంబుగా దేవతాలోకంబు లెన్నుచుండః కృపావలోకంబుల ద్రిలోకంబులు బాలించుచుండుము. మా పొందుపట్లకు పొందుగానేగి వత్తమను గ్రహింపుము.

వామ—శంకరా! మీరటుల నాతో వేరుగా తెలపీయవలయునా! మనకిరువురకును భేదమేమున్నది! మీ తెలుపుచొప్పుననే వర్తించుచుండెదను.

కుమా—ఉపేంద్రా! అనంతకళ్యాణగుణసాంద్రా! నీ యనుజ్ఞయైనచో నిక దేవతానీకమును శ్రీకరంబుగా పాలించుచుండెద. తెలవోసంగుము.

వామ—కుమారా! మంచిదట్లనే శక్తిసహితుండవై దేవసేన్యాను రక్తిగలిగి నెలయుచుండుము.

దిక్పాలకులు—ఉపేంద్రా! దయాసాంద్రా! నీ యనుమతియైనచో మేమును మా నిజనివాసంబులకేగివత్తుము. తెలవోసంగుము.

వామ—మంచిది అటులనే లోకపాలకులారా! వెళ్ళిరండు.

(ఇట్లంతయును వెళ్ళుచున్నారు. అదితికశ్యపులును శచీపురందరాది సమేతులై యుపేంద్రుని దోడ్కొని యంతఃపురమందిరములకు వెళ్ళుచున్నారు.)

(అంత నటకులందరుకలిసి మంగళహారతులు పాడుదురు)

గీ॥ మంగళము గానలోల రమావిలోల
మంగళము భక్తసుచేల మానిఖేల
మంగళము భవ్యతరశీల మాన్యహేల
మంగళము వేణుగోపాల మహితలీల.

క॥ సుందరకవితాచాతురి
సుందరకవినైననేను సురుచిరలీలన్
బొందుగ రచియించితి నిటు
లందఱు సత్కృతులునెంచి హర్షించునటుల్.

క॥ హరిచరిత మెఱిగినుడు వగ
సరసిజభవ భవసురేంద్ర సనకశుకాదుల్
దరిగనరన నాతరమా
పరమాదరలీలగనుడు పండితులారా ?

గీ॥ మున్ను వామన నాటకమును రచించి
యిప్పుడు మహేంద్రనాటకమిట్లు వ్రాయు
నన్ను మన్నించి తప్పులనెన్నబోక
చేకొనుము దీనిహతదోష శ్రీనివాస.

ఇది శ్రీమన్మహారాజరాజేశ్వరీకరుణాకటాక్ష వీక్షాలహరీవరప్రసాద పరీత సంగీతసాహిత్య సరసకవితాచాతురీ ధురీణ లౌకిక విద్యా విశేష ప్రవీణ సత్యవోలు కులకలశజలధి కువలయమిత్ర భారద్వాజస గోత్ర భగవత్కృపావివర్ణపవిత్ర సోమరాజామాత్య పౌత్ర వెంకట రాయమంత్రి వరపుత్ర రామాంబాగర్భ శుక్తి ముక్తాఫలోదయ సకల సుకవి, విద్వజ్జన విధేయ; సోమసుందరకవినామధేయ ప్రణీతంబైన మహేంద్ర విజయనాటకంబునందు షష్ఠాంకము సర్వంబును

సంపూర్ణము

శ్రీ రుక్మిణీ సమేత శ్రీ వేణుగోపాల పరబ్రహ్మార్పణమస్తు.

సర్వమంగళానిభవంతు.

శ్రీ శ్రీ శ్రీ

# సత్యవోలు సోమసుందరకవిగారి

# గ్రంథములు.

వచనాంధ్రకాదంబరి—ప్రతియాంధ్రుడును చదువదగినది.

అద్భుతమైన కథ—మృదు మధురమైనశైలి—చక్కని వచనము.

జగత్ప్రసిద్ధమైన గ్రంథము. గంభీరమైన కథాచమత్కారము లోకసాంప్రదాయకములైన కల్పనాదు లనేకములు గలవు. ఇట్టి వర్ణనాదు లేయితరభాషలయందును లేవు. ఆంధ్రమున నిదివరకిట్టిసంపూర్ణగ్రంథ మెచ్చటను బయలుదేరియుండలేదు. చదివి తీరవలెను.

| | | |
|---|---|---|
| వచనాంధ్రకాదంబరి 1_2 భాగములు రెండు | రు | 3—0—0 |
| ఆంధ్ర పండితరాయ శతకము | ... | 0—8—0 |
| జగదంబా నారదప్రసంగము | ... | 0—8—0 |
| ఆంధ్రచంపూభాగవతము | ... | 1—0—0 |
| లోకోక్తి ముక్తావళి | ... | 0—4—0 |
| చమత్కార రసమంజరి | ... | 0—4—0 |
| సూక్తిముక్తావళి | ... | 0—4—0 |
| అహింసా ప్రబోధిని | ... | 0—12—0 |
| కాదంబరి నాటకము | ... | 0—8—0 |
| రతిమన్మథనాటకము | ... | 0—8—0 |
| సంగీత పార్వతీపరిణయము | ... | 0—8—0 |

## అముద్రితములు.

| | | |
|---|---|---|
| రుక్మిణీపరిణయము | — | విక్రమార్క చరిత్ర |
| శ్యామలాంబ శతకము | — | సంగీతసారసంగ్రహము |
| జగ్గరాయభూపశతకము | — | చాటుధారాసుధాంబుధి |

ఈ మొదలైనవిగలవు. భాషాభిమానులు వీరి ముద్రిత గ్రంథములు గైకొని యైన యముద్రిత గ్రంథములు అచ్చుపడుటకై సాయపడుదురుగాక!

**సత్యవోలు రాధామాధవరావు,**

సకలానంద గ్రంథమాలిక,

[illegible]